

సామాజికాలింగనం






ముఖచిత్రం : వసంత విలాసిని

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య


యువ సాలు చందా రు. 1

దీపావళి ప్రత్యేకసంచికతో రు.

యువ సైఫాబాద్ హైదరాబా70

చలం సమర్పించు శ్రీ రమణ చిత్ర వారి

# సంబరాల రాంబాబు

దర్శకత్వం: జి.వి.ఆర్. శేషగిరిరావు

నిర్మాత: టి. మోహన్‌రావు

శ్రీ ఫిలిమ్స్

ఫిబ్రవరి నెల రాకముందే చేరిన ఫిబ్రవరి 'యువ' ఎంతో ఆకర్షణీయంగా ఉంది. 'భైరవి' సంక్షిప్తనవల బాగుంది. కౌసల్యాదేవిగారి "సంసార చక్రం" బాగా సాగిపోతోంది. డి. కామేశ్వరిగారు వ్రాసిన "అతకని బ్రతుకులు" కథానిక, అంతకుముందే (జనవరిలో) ప్రచురితమైన "నగరంలో నాలుగిళ్ళు"ను పోలి ఉంది. యువలో మొదట చదవదగినది సంపాదకీయమే నంటే దాన్ని గురించి ఇంక చెప్పనవసరం లేదనుకుంటా !

పి. ఎ. వి. ఎన్. కుముద్ నాథ్, కావలి

ఫిబ్రవరి 'యువ' చదివాము. ఇందులో డి. కామేశ్వరిగారి 'అతకని బ్రతుకులు' కథతోబాటు 'మనిషిలో మనిషి' అను కథగూడా చాలా బాగుంది. ముఖ్యంగా 'మీనా' సీరియల్ మేనాలో కూర్చున్నంత హాయిగా సాగిపోతూంది. సత్యమ్‌గారి కార్టూన్స్ పత్రికకు వన్నె కల్గిస్తున్నాయనుటలో సందేహము లేదు. వారికి మా ధన్యవాదములు.

కన్నోజు లక్ష్మీకాంతము
కె. మనోహరాచారి
హుస్నాబాద్

---

# మీరు కష్టపడి సంపాదించుకొన్న సొమ్ముకు సరియైన విలువగల సైకిల్ కొనదలచుకున్నారా? హెర్క్యులిస్



ప్రతీపైసాకూడ మీరు కష్టపడి చమటఊడ్చి సంపాదించుకున్నారు. మీరు కూడబెట్టిన అమూల్యమైన సొమ్మును సరియైన విలువగల సైకిల్ మీద పెట్టాలి కదా?

హెర్క్యులిస్‌ను కొనండి. దానికి మీరు ఆశించే అన్ని లక్షణాలువున్నాయి — బలిష్టత, సాఫీగా పోవడము, కచ్చితము, వేగము, మన్నిక.

అది సహజమే.

హెర్క్యులిస్ — ఆగ్నేయ ఆశియాలో అన్ని సౌకర్యాలుగల పెద్ద ఫ్యాక్టరీలో నిర్మించబడింది కలకాలం మీ జీవితమంతా మీకు సేవజేస్తుంది. భారతదేశమంతటా 3,000,000 మంది హెర్క్యులిస్‌నే విశ్వసించేవారిలాగే మీరు హెర్క్యులిస్‌ను విశ్వసించవచ్చు.

హెర్క్యులిస్ ఒక్క సైకిలేకాదు. మీ జీవిత కాలపు నేస్తము.

భారతదేశములో తయారుచేయువారు: టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా, అంబత్తూరు, మద్రాసు-53.

ప్రొప్రైటర్లు: ట్యూబ్ ఇన్‌వెస్ట్‌మెంట్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్ అనుమతిని పొందినవారు.

* రిజిష్టర్డ్ ట్రేడ్‌మార్కు -
ది హెర్క్యులిస్ సైకిల్స్ & మోటార్ కో., లిమిటెడ్ యు. కె. వారిది.







TIC-H-5452

"చిన్నకుటుంబమే - సుఖవంతమైన కుటుంబం."

**1957-వ సంవత్సరములో అతని వయస్సు 8 సంవత్సరములు.**



# అతని తండ్రి భవిష్యత్తులో కళాశాల ఖర్చు భరించవలెను

పెద్దచదువుచెప్పించలేకపోవుటవల్లకలుగు పర్యవసానములను గూర్చి విచారించెను. అతని కుమారునికి టెక్నికల్ చదువుకు అవకాశము కలిగించుటకు యోచించెను. ముందుగానే కావలసిన డబ్బు ఇంజినీరు చదువుకు పొదుపుచేసెను. ఎడ్యుకేషనల్ యాన్యుఇటీపాలసీ-అతను లేకపోయిననూ డబ్బు ఇచ్చు విధానములో సొమ్మును వెచ్చించెను. ఇటువంటి ప్రత్యేక రక్షణ ఒక జీవితభీమా మాత్రమే ఈయగలదు. వయస్సు 30 సంవత్సరములగుటచే పాలసీ ప్రీమియము స్వల్పముగా కట్టగలిగెను రూ. 25. 13నెలసరి 15సంవత్సరములకు కట్టెను. ఇప్పుడు అతని కుమారుడు ప్రతి ఆరుమాసములకు రూ. 400/- చొప్పున 5సంవత్సరములపాటు కాలేజి ఖర్చులకు రొఖ్ఖము తీసుకొనుచున్నాడు.

నీ కుమారునికి ఏవిధమయిన అండాలేకుండా ఈకఠోరమయిన ప్రపంచములో విడుచుట భావ్యమా? కావలసినది కొంత దూరదృష్టి. మీ ఎల్.ఐ.సి ఏజంటును నేడే చూడండి. మీకుమారునికి కాలేజీలో చదువుకొను అవకాశము కలిగించుటకు అనువగు పాలసీ మీరు ఎన్నుకొనుటకు సహాయము చేయగలడు.



జీవిత భీమాను
మించినది
మరొకటి ఏది లేదు



# మీరు త్రాగే కాఫీ చిక్కగా, కమ్మగా, స్ట్రాంగ్‌గా మరియు క్షణంలో కావాలంటే...

**బ్రూ**

**మీకు కావల్సింది అదే**






చిక్కని, స్ట్రాంగ్
కాఫీ చికరి బ్లెండ్
క్షణంలో తయారౌతుంది!
సేద దీర్చి, ఉల్లాసాన్నిచ్చుటలో
దాన్ని మించినది లేదు.

**బ్రూక్ బాండ్**

**బ్రూ** ఇన్‌స్టాంట్

**కాఫీ చికరి బ్లెండ్**

Bensons/286B/6 TEL

GEMINI Presents

*J. V. Productions*

# పైసా - యా - ప్యార్



जेमिनी
प्रस्तुत

जेवी प्रोडक्शनस

# पैसा या प्यार

ईस्टमेन कलर

PAISA YA PYAR پیسہ یا پیار

रवि · साहिर · पं. मुखराम शर्मा

**NAVRANG**
HYDERABAD

***

**MINERVA**
SECUNDERABAD

—a B. Marideswara Rao & Co. Release

# యువ

## సచిత్ర మాసపత్రిక

సంచాలకుడు: చక్రపాణి

సంపుటి 21 | మార్చి, 1970 | సంచిక 3

ఫిబ్రవరి 4 వ తేదీన, గుంటూరు జిల్లాలోని వినుకొండ వద్దనున్న అగ్ని గుండాల రాగి గనులనుంచి రాగిని త్రవ్వడం ప్రారంభమైంది. ఇక్కడ వున్న రాగి చాలా శ్రేష్ఠమైనదే కాక, చాలా ఎక్కువగా వున్నదనీ, కొన్ని తరాలపాటు దీనిని త్రవ్వుతూ వుండవచ్చుననీ భూగర్భ శాస్త్రజ్ఞులు కనుక్కున్నారు. ఈ పరిశోధనలు ఎప్పుడో జరిగినప్పటికీ, ఆధునిక యంత్ర పరికరాలతో ఇక్కడి రాగిని వెలువరించటానికి యిన్నాళ్ళూ కేంద్ర ప్రభుత్వం సహాయపడలేదు. ఇప్పటికైనా, కేంద్ర ప్రభుత్వం యీ పనికి సహాయపడడమూ, రాష్ట్ర ప్రభుత్వపు సూచనలను అంగీకరించడమూ కొంతవరకైనా ఆంధ్ర ప్రజలకు సంతోషాన్ని కలిగిస్తున్నాయి.

వినుకొండ తాలూకా, పూర్తిగా మెట్టప్రాంతం. చాలా వెనుకబడిన ప్రాంతం. ఇక్కడి ప్రజలు జీవనోపాధి విషయంలో చాలా కష్టపడుతూ

వున్నారు. ఈ ప్రాంతంలో భూగర్భంలో వున్న ఖనిజ సంపదను స్పష్టంగా కనుక్కొని, ఆ సంపదను వెలువరించి, స్థానికంగా పరిశ్రమలను స్థాపించి ఆ ఖనిజాలను ప్రజలకు ఉపయోగపడే వస్తువులుగా తయారు చేయించడం జరిగితే, అక్కడ పెద్ద పరిశ్రమలూ, చిన్న పరిశ్రమలూ ఏర్పడి, ఆ ప్రాంతంలోని ప్రజలకు జీవనోపాధి కలుగుతుంది. ప్రస్తుతం, ఇక్కడ త్రవ్వబడే రాగిని ఎక్కువగా ఎగుమతిచేసే వుద్దేశం కనపడుతున్నది. మనదేశంలో ఇంజనీర్లకూ, సాంకేతిక నిపుణులకూ కొరత లేదు. చాలా మంది సాంకేతిక నిపుణులు, తమ విజ్ఞానాన్ని ప్రయోజనకరంగా ఉపయోగించే అవకాశాలు లేకనూ, తగిన ఆదరణ లేకనూ అమెరికాకూ, కెనడాకు వెళ్ళి అక్కడ వుండిపోతున్నారు. అలా జరగనివ్వకుండా, సాంకేతిక నిపుణులకు తగిన అవకాశాలను కలిగించి, ఏ ఏ ప్రాంతంలో ఏ ఏ సహజ సంపద లభిస్తున్నదో, ఆయా ప్రాంతాలలో, ఆ సహజసంపదను ప్రయోజనకరమైన, ఉపయోగకరమైన సాధన సామగ్రిగా తయారు చేయించడానికి అక్కడికక్కడే పరిశ్రమలను స్థాపించినట్లయితే, పరిశ్రమలు అభివృద్ధిపొంది ప్రజలకు పనిపాటలు దొరకడమే కాకుండా, ప్రతి ప్రాంతమూ సుభిక్షంగా తయారవుతుంది.

అగ్నిగుండాల వద్ద రాగి గనుల త్రవ్వకం ప్రారంభం కావడం ఆనందకరమైన విషయమైనప్పటికీ, అక్కడ త్రవ్విన ఖనిజాన్ని కేవలం ఎగుమతిచేసే ముడి సరకుగానే ఉపయోగించడం జరిగితేమాత్రం మనం సంతోషించ వలసినది ఏమీ లేదు. అలా జరగకుండా, అగ్నిగుండాల వద్ద రాగిని ఉపయోగించే పరిశ్రమలనన్నిటినీ ఒకదాని తరువాత మరొకటిగా, త్వరత్వరగా స్థాపించడం అవసరం. ఈ విషయంలో, రాష్ట్ర ప్రభుత్వం గట్టి పట్టుదల చూపాలి.

అగ్నిగుండాలవద్ద రాగి గనులు వున్నట్టుగానే, మన రాష్ట్రంలోని

ప్రతి జిల్లాలోనూ ఏదో ఒక ప్రధానమైన ఖనిజం లభిస్తుంది. ఈ ఖనిజాలను వెలువరించి, వాటిని ఉపయోగించే పరిశ్రమలను ఎక్కడికక్కడ స్థాపించడానికి కృషి జరగాలి. గోదావరి లోయ ప్రాంతంలో బొగ్గు మాత్రమేకాక, పెట్రోలుకూడా ఎక్కువగా లభించే అవకాశం వున్నదని భూగర్భ శాస్త్రజ్ఞులు అంటూవున్నా, గోదావరి లోయలో పరిశోధనలు జరుపక, కావేరిలోయలో పరిశోధనలు జరపడం జరిగింది. అలా జరుగుతూ వున్నప్పుడే, ఆ విషయంపట్ల మేము నిరసన ప్రకటించాము. ఏమయితేనేం, కావేరి లోయలో పరిశోధనలు పూర్తి అయాయి. అక్కడ పెట్రోలు దొరికే అవకాశం లేదని భూగర్భ శాస్త్రజ్ఞులు ప్రకటించారు. వృధా అయిన యీ పరిశోధనలకు బోలెడు డబ్బు వ్యయమైంది. ఇప్పటికైనా కేంద్ర ప్రభుత్వం కన్నుతెరచి, గోదావరి లోయలో పరిశోధనలు వెంటనే జరిపించడం అవసరం. రాష్ట్ర ప్రభుత్వం గట్టిగా కృషి చేస్తేనేగాని, కేంద్ర ప్రభుత్వం ఈ విషయంలో శ్రద్ధ చూపదు.

చాలా విషయాలలో కేంద్ర ప్రభుత్వం శ్రద్ధ చూపకపోయినా, రాష్ట్ర ప్రభుత్వం చొరవచేసుకొని, ఒక పద్ధతి ప్రకారం పరిశ్రమలను స్థాపించడానికి పూనుకోవచ్చును. ఖనిజ సంపద లభించే ప్రతిచోటా, ఆయా ఖనిజాన్ని ఉపయోగించే పరిశ్రమలను, చిన్న చిన్నవిగానే ప్రారంభించడాన్ని రాష్ట్ర ప్రభుత్వమే చెయ్యవచ్చును. లేదా, చిన్న చిన్న సహకార సంఘాలకో, వ్యక్తులకో లైసెన్సు ఇచ్చి చిన్న పరిశ్రమలను ప్రారంభించవచ్చును. అలా చేసినట్లయితే, నిరుద్యోగ సమస్యను పరిష్కరించడం సులువు అవుతుంది. ఈనాడు వేల సంఖ్యలో ఇంజనీర్లు నిరుద్యోగులుగా వున్నారు. ప్రతి ప్రాంతంలోనూ కొంతమంది ఇంజనీర్లు ఒక సహకార సంఘంగానో, కంపెనీగానో ఏర్పడి చిన్న చిన్న

పరిశ్రమలను స్థాపించినట్లయితే, తమకు తాము ఒక కృషిని కలిగించుకోవడమేకాక, దేశం పారిశ్రామికంగా అభివృద్ధిపొందడానికి అవకాశం కల్పించిన వారవుతారు. ఈ విషయంలో ఉత్సాహంతో ముందుకు వచ్చిన వారందరికీ, ఏమాత్రం అంతరాయాలు కల్పించకుండా తగిన ప్రోత్సాహాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఇవ్వాలి.

ఇలాటి కృషి రాష్ట్రమంతటా జరిగినట్లయితే, కేంద్ర ప్రభుత్వపు ప్రమేయంలేకుండానే రాష్ట్రం బాగుపడుతుంది. చిన్నవిగా ప్రారంభమైన పరిశ్రమలను విస్తరింపచేసుకోడానికి కేంద్ర ప్రభుత్వం అడ్డుపడడానికికూడా వీలుండదు. మొదట్లోనే పెద్ద పరిశ్రమలను స్థాపించడానికి ప్రయత్నం జరిగినప్పుడల్లా కేంద్ర ప్రభుత్వం అనుకూలించకపోవడం ప్రస్తుతం జరుగుతున్నది. ఆంధ్రదేశంలో పెద్ద పరిశ్రమలను స్థాపించడానికి ఏమాత్రం సహాయాన్నీ, సహకారాన్నీ చూపని కేంద్ర ప్రభుత్వాన్ని దారికి తీసుకురావాలంటే, చిన్న పరిశ్రమలు స్థాపించి, వాటిని విస్తరింపచేసుకోవడం ఒక మంచిమార్గం.

---



# రెండు ప్రపంచాలు

సుప్రభ

మార్చినెల మధ్యాహ్నం. ఆ పూట క్లాసులు లేవు. యూనివర్సిటీ బిల్డింగ్‌లోనుంచి బయటకు వచ్చి బస్ స్టాప్ దగ్గర నుంచున్నాను. అమెరికాలో అరుదుగా కనిపించే సూర్యరశ్మి వెచ్చగా వుంది. అప్పుడే కొత్తచిగుళ్ళు పట్టిన చెట్లు పచ్చగా మిసమిస లాడుతున్నాయి. వసంతం అడుగు పెట్టినా, చలికాలానికి పూర్తిగా వదిలి పోబుద్ధికాలేదులా వుంది- గాలిలో చిరుచలి వెచ్చని సూర్యరశ్మి దాటి శరీరాన్ని తాకుతూంది.

విసుగ్గా వాచ్‌వంక చూసుకున్నాను. అక్కడికి వచ్చి అయిదు నిమిషాలే అయినా, అప్పటికి వాచివంక మూడు సార్లయినా చూసి వుంటాను. కబుర్లలో పడ్డప్పుడు క్షణాలుగా గడిచిపోతాయి

గంటలు. కావలా దగ్గరకు వచ్చేసరికి కాలం స్తంభించిందా అన్నట్లుంటుంది.

సందు మొదలులో బస్సు కనిపించే సరికి తేలిగ్గా నిట్టూర్చాను. ఈరోజు ఎందుకో నా మనసు నా స్వాధీనంలో వుండదు. అది అబద్ధమని రుజువు చేయ డానికి నేను పడే తిప్పలు వృధా అని పోయిన రెండుమూడేళ్ళనుంచి తెలుస్తూనే వుంది. అందుకే చదవాల్సింది బోలె డున్నా లైబ్రరీకి వెళ్ళకుండా ఇంటి మొహం పట్టాను.

బస్సుదిగి యిల్లు చేరేసరికి, యిల్లు యధాప్రకారంగావుంది. నా ఆలోచనకు నేనే నవ్వుకున్నాను నిర్లిప్తంగా: ఆ చిన్న ఎపార్ట్మెంటులో వంటరిగాడిని. పొద్దున వదిలిపోయిన యిల్లు వదిలిన ట్లుండక యింకోలా ఎలా వుంటుంది! అనుకున్నాను. యిదేం స్వంత యిల్లు కాదుగా. తను యింటి దగ్గర వున్నప్పు డయితే తన రూమ్ ఎప్పుడు చూసినా హాయిగా, శుభ్రంగా కూచుని చదువుకో వాలనిపించేటట్లు వేటి స్థానంలో అవి వుండేవి. తను కాలేజికి పోగానే ఏదో ఒక సమయంలో హేమవచ్చి అన్నీ ఎక్కడివక్కడ సర్దివెళ్ళేది.

ఇక్కడ నా గది నాకు మామూలే! ఎప్పుడయినా ఏ విషయం మీదనయినా మనసుకు తోచినవి ఓ కాగితంమీద రాసి పెడ్తాను. మళ్ళీ మర్నాడు ఆ కాగితాన్ని వెతకాలంటే కనీసం ఓ రెండుగ్గంటలు వృధా అవవలసిందే. వారానికోరోజు తీరిక చేసుకుని ఎపార్ట్మెంటు అంతా సర్దుతూవుంటాను. కాని అదేం పాపమో గాని, సర్దినంతసేపు పట్టేదికాదు యధా స్థానానికి రావడానికి.

నాకు నా రూమ్ కొత్తగాదు. దాదాపు పద్దెనిమిది నెలలనుండి అక్కడే వుంటు న్నాను. కొన్నాళ్లు ఇంకొక ఇండియన్తో కలసివున్నాను. మొత్తంమీద నాకు తెలియకుండానే ఈ వంటరి జీవితానికి యిష్టం కలగసాగింది.

అటూ, యిటూ ఏమీ తోచక తిరుగు తూంటే మనసు గతంలోకి పోతూంది. ఇంక ఇలా గాదని రిఫ్రిజిరేటర్ తెరిచి ఓ బీరు బాటిల్ తీసుకుని సోఫాలో కూర్చున్నాను. పక్కనే వున్న రికార్డ్ ప్లేయర్ పెట్టి అలాగే కూర్చుండి పోయాను.

మనసు పరిపరి విధాల పోసాగింది. మధ్య, మధ్య యింత అమూల్యమయిన సమయాన్ని యిలా వృధా పరుస్తున్నా నేమో అనిపించసాగింది. చదవాల్సింది వుంది. థీసిస్కు సమకూర్చుకోవలసిన మేటర్ పూర్తికాలేదు. ఏ పనీ చేయ కుండా యిలా గడుపుతున్నా నేమిటని నన్ను నేనే మందలించుకోబోయాను. కాని నాకు తెలుసు అంతగా ఫలిత ముండదని.

మూడేళ్ళక్రితం మార్చినెలలో యీ రోజు జరిగినదాన్ని నన్ను మరువ




నివ్వవు నా స్మృతులు. ఏదో జరిగి వుండాల్సిందని, జరిగినదాన్ని జరగకుండా ఆపలేకపోయానని నా మనసు తొలుస్తూనే వుంటుంది. కాని యిప్పుడు ప్రయోజనం లేదని తెలుసు. జరిగిన ప్రతిక్షణం చేయిజారిన గాజుముక్కలాంటిది.

కాని......ఎందుకీ అసంతృప్తి వెన్నాడుతూంది? సృష్టిలో ఏర్పడిన భేదాలు సర్దుబాటు చెయ్యలేకపోయానన్న తపన నా ఒక్కడికే ఎందుకుండాలి? యీ భేదాల్ని చూచి నాకు కలుగుతున్నది తపనో? లేక నా వారికి అన్యాయం జరిగిందన్న ఆవేదనో, అసహ్యమో, మరేదో నాకే తెలియదు. నా భావాలకు రూపాన్ని నేనివ్వలేను.

సందిగ్ధంలో కొట్టుకుపోతున్న నాకు నా చేతిలోని బీర్ బాటిల్ ఖాళీ అయిందని తెలియలేదు. పక్కన ఆటొమేటిక్ రికార్డ్ ప్లేయర్ దానంతట అదే ఒక్కొక్క రికార్డే పడేసుకుని పాడేస్తోంది.

సీసా గార్బేజ్‌బాగ్ (డస్ట్‌బిన్)లోకి విసిరేసి కిటికీకి దగ్గరగా వెళ్ళి నుంచున్నాను. బయట చిన్న పిల్లలు జోరుగా మూడుచక్రాల సైకిళ్లు తొక్కుతూ ఆడుకుంటున్నారు. వాళ్ళతోపాటు బయటకు వచ్చి తల్లులు కబుర్లు చెప్పుకుంటూ నుంచుని వున్నారు.

'బ్యూటిఫుల్. బ్యూటిఫుల్ బ్రౌన్ ఐస్' ఫ్రాన్సిస్ పాట చెవులోకి దూరింది. యధాలాపంగా అటు తిరిగి

పాట వింటూ నుంచున్నాను. బ్రౌన్ ఐస్, బ్లాండ్ హెయిర్ అనుకుంటూ వుంటె అప్రయత్నంగా సూసన్ గుర్తుకు వచ్చింది. మిలమిలా మెరిసే నీలికళ్ళు, నున్నని గులాబి చెంపలు, నిగనిగలాడే మెడ వెనుక భాగాన్ని కప్పేస్తూ మెత్తగా జారిపోయే బ్లాండ్ హెయిర్. ఎందుకో తెలియకుండానే ఆమె మీదకు తీసుకు వెళ్లాయి ఆలోచనలు. కళ్ళనిండా తొణి కిసలాడే యాంబిషన్స్‌తో ఆరోగ్యంగా, ఉత్సాహంగా వుండే సూసన్‌ని గురించి ఆలోచిస్తూ వుండిపోయాను.

అమెరికాకు వచ్చి 18 నెలలయినా అలాంటి అమెరికన్ కుటుంబం నేను యింకొకటి చూడలేదు. వాళ్ళింటికి ఎప్పుడు వెళ్ళినా నేను అక్కడ పరాయి వాడినన్న భావన కలుగదు నాకు. మన సంతా ఆనందాన్ని నింపుకుని, జీవిత మంతా సంపూర్ణమయిన కోరికలు కూర్చు కుని, అవి తీర్చుకుంటున్న ఆ కుటుం బాన్ని చూస్తూవుంటే నాకు బంధువుల మధ్య వున్న భావనే వస్తుంది.

వెంటనే కూర్చున్న చోటినుంచి చటుక్కున లేచి టెలిఫోన్ దగ్గరకు వెళ్లాను. నెంబర్ చూచి అక్కడకు ఇరవై మైళ్ళ దూరంలోవున్న రాన్ టూల్‌కు ఫోన్ చేశాను. మిసెస్ విల్సన్ ఫోను ఎత్తింది. యీ వీకెండ్ మీరు బిజీగా వున్నారా అని అడిగాను. 'లేదు, పొలం పని వుంది' అన్నది. 'నేను మీ యింటికి వద్దామనుకుంటున్నాను, మీకు ఏ యితరమయిన యిబ్బందిలేకుంటే' అన్నాను.

"నోనో. మా కేమీ యిబ్బంది లేదు. తప్పకుండా రా! మనం కలిసికూడా మూడు నెలలు దాటుతోంది. మళ్ళీ యిది శైముకూడా!" అంది నవ్వుతూ. "ఇవాళ డేవిడ్ ఆ వూరు వస్తున్నాడు ఏవో వస్తువులు కొనడానికి. అటునుంచి మీ యింటికొచ్చి నిన్ను రిసీవ్ చేసుకుంటాడు," అంది,

"ఒ.కె." అని మూసేశాను. వెంటనే బయటకు వెళ్లాను ఏదయినా బహుమతి తీసుకు వెడదామని మిసెస్ విల్సన్‌కు పువ్వులంటే ప్రాణం. వాటిని అపురూప మయినవాటిలా యిల్లంతా అందంగా అమర్చుతూ వుంటుంది. పూలు కొందామని షాపుకు వెళ్ళాను. అంద మైన పూలను చూడగానే ఎందుకో మనసుకు మళ్ళీ ఏదో తగిలినట్లనిపిం చింది. మా హేమకు గులాబులంటే ఎంతో యిష్టం. ఎప్పుడూ ఆ చెట్లదగ్గర కూర్చుని గొప్పులు తవ్వటమో, అంట్లు ట్టడమో చేస్తూ వుండేది. అప్రయ త్నంగా కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి వెంటనే తమాయించుకుని, పూలుకొని, బాక్సులో పెట్టించుకుని యింటికి వెళ్లాను.

సాయంత్రం అయిదున్నర అయ్యే సరికి మిస్టర్ విల్సన్ వచ్చాడు. ఇద్దరం కలసి రాన్‌టూల్ వెళ్ళాం. రాన్‌టూల్

నేనున్న వూరుకు దాదాపు ఇరవై మైళ్ళ దూరంలో వున్న పల్లెటూరు. మిష్టర్ విల్సన్ కొంత టైము బయట పనిచేస్తూ యింటిదగ్గర స్వంత పొలంపని చూస్తూ వుంటాడు. నాలుగయిదు ఎకరాలస్థలంలో వాళ్ళిల్లు ఎత్తి పెట్టినట్లు కనుపిస్తూ వుంటుంది. ఇంటివెనక, ముందు రకరకాల కూరగాయలు మొక్కజొన్నలు బీన్సు వేస్తూంటారు. వాళ్ళకు స్ప్రింగ్ వచ్చిందంటే పొలం పనులతో తీరికే వుండదు.

నేను, విల్సన్‌కలిసి కొన్ని వస్తువులన్ని లోపలకు చేరవేశాం. లోపలకు వెళ్ళగానే ఎదురుగావచ్చిన, మిసెస్ విల్సన్‌కు నేను తెచ్చిన పూలు అందించాను. వాటిని ఆమె ఆనందంగా అందుకుంటున్నా, ఆపూట ఆమె ముఖంలో ఏదో కోల్పోయిందని, దేనికో చోటు చేసుకుందని స్పష్టంగా తెలిసింది.

వచ్చి అరగంటయినా ఆపూట సూసన్ కనుపించలేదు. నాకేమిటో ఆశ్చర్యమనిపించింది. ఎప్పుడూ నే వచ్చేసరికి వాకిట్లోనే ఎదురయి పల్కరించే సూసన్ యీరోజు ఏమయిందని అనుకున్నాను.

ఆఖరికి డిన్నర్‌టేబుల్ దగ్గరకూడా కనిపించకపోయేసరికి నాకిక మనస్సు వుండబట్టలేదు. యింక చివరకు అడిగాను ఆగలేక — "యివాళ సూసన్ కనిపించటంలేదు. యింట్లో లేదా ?" అని.

'ఇంట్లోనేవుంది. ఒంట్లో ఎక్కువ బాగాలేదు' అంది మిసెస్ విల్సన్ ముభావంగా, తల కిందకు వాల్చుకుని. ఆమె మ్లానవదనం చూచాక యింకేమీ అడగలేక మౌనంగా భోజనం పూర్తి చేశాను. కాని ఆ పూటంతా ఏదో లోపం నాకు కనిపిస్తూనేవుంది. వాళ్ళకు నేనురావటం ఇబ్బందిగా ఉందేమో అనిపించింది. 'ఛ. వాళ్ళింటికి ఎన్నోసార్లు వెళ్ళాను. పోయిన రెండుకిష్టమస్‌లు వాళ్ళింట్లోనే గడిపాను. నేను అంత దగ్గరగా వచ్చిన కుటుంబం ఏదయినా వుంటే అదొక్కటే!' వాళ్ళకు నేను రావడం యిబ్బందిగా వుందేమో అన్నభావన నాకే సిల్లీగా తోచింది.

విల్సన్‌కు ఒక్కతేఅమ్మాయి. తనకు పై చదువులు చదువుకునే అవకాశం ఎక్కువగా లేకపోవడంతో ఆయనకు పెద్ద చదువులు చదివేవాళ్ళంటే ప్రత్యేకమయిన అభిమానం. నేను ఎప్పుడెళ్ళినా నా చదువుగురించి శ్రద్ధగా విచారిస్తూ వుండేవాడు. సూసన్ బాగా చదవాలన్నదికూడా ఆయన కోరికే!

డిన్నర్ అవగానే లివింగ్‌రూమ్‌లో కూర్చున్నాం టెలివిజన్ చూస్తూ మధ్య మధ్య కబుర్లు చెప్పుకుంటూ. మిసెస్ విల్సన్ మాతోపాటు ఓ అరగంట కూర్చుని 'ఎక్స్‌క్యూజ్ మి. నే నింక పడుకుంటాను' అని వెళ్ళిపోయింది.

నా కెంతో ఆశ్చర్య మనిపించింది. మే మెప్పుడు కలిసినా రాత్రి పదకొండు పన్నెండు గంటలదాకా కబుర్లేసుకుని కూర్చుంటాం. కాని యివాళ ఎందుకో...

నేను చాలా యిబ్బందిగా ఫీలయ్యాను. 'మీరూ బాగా టైర్ అయ్యారనుకుంటాను. యిక పడుకుందామా' అన్నాను.

'నా. నా. నేను బాగానే వున్నాను. కూర్చో కాసేపు కబుర్లు చెప్పుకుందాం' అన్నాడు విల్సన్.

కాని ఆయన మనసులోకూడా ఏవో నీలిమబ్బులు ముసురుకొన్నాయని గ్రహించడానికి ఆట్టేసేపు పట్టలేదు. అదేమిటో తెలుసుకోవాలన్న జిజ్ఞాస వున్నా, ఆ చనువు తీసుకునేందుకు సాహసించలేకపోయాను.

చివరకు చాలా సేపటికి, ఆయనలో ఆయనే తటపటాయించి నాకు అసలు విషయం చెప్పాడు. ఆ విషయం వినగానే తలమీద ఎవరో మోదినట్లనిపించింది. అసలు ఏం మాట్లాడాలో చాలా సేపు తెలియకుండా పోయింది. చివరకు అన్నాను. 'అయినా సూసన్ అదృష్టవంతురాలే! యిక్కడ పుట్టింది' అన్నాను, మాటలు పెగుల్చుకుని. ఆయన విచిత్రంగా చూశాడు నా వంక. నాదగ్గర ఆయనకు సమాధానం దొరకలేదు.

యింకో గంటసేపు అవి యివి మాట్లాడి, ఎవరిదోవన వాళ్ళం పెళ్ళి పడుకున్నాం. మెత్తటి మంచంమీద వాలిన నాకు ఒళ్ళంతా కంపరమెత్తసాగింది. ఎంత ప్రయత్నించినా మనసు స్వాధీనంలోకి రాలేదు.

సూసన్ ఈ రొంపిలోకి ఎలా దిగింది? ఎప్పుడుచూచినా చలాకీగా, హుషారుగా రకరకాల భావాలతో, ఎన్నో కోరికలతో కలలుకంటూవుండే సూసన్‌కు యిది ఎలా సంభవించింది? అనుకున్నాను బాధగా.

సూసన్‌లో నాకు యితర అమెరికన్ ఆడపిల్లలలోలేని ప్రత్యేకత కనుపించేది. అదేమాట ఆమెతో అన్నానుకూడా! చాలామంది అమెరికన్ ఆడపిల్లలు త్వరగా పెళ్ళిళ్ళు చేసుకుని జీవితంలో స్థిరపడిపోవాలన్న కోరికతో వుంటారు. కాని సూసన్ అలాకాదు. పై చదువులు చదవాలని, యూరప్, కాంటినెంట్ అంతా తిరిగి చూడాలని, ఏవేవో రకరకాల కోరికలు చెప్తూ వుండేది. 'నాకు పూర్తిగా సంసార జీవితంలో స్థిరపడాలని లేదు. మనకు దరిదాపుల్లో లేని విద్య ఎంతోవుంది. ఎన్నో చెయ్యాల్సినవి. చూడాల్సినవి వున్నాయి. వాటిలో కొన్నయినా చూడాలని, కొంతయినా తెలుసుకోవాలని వుంది' అనేది. 'యిల్లు సంసారంకాక బయట ప్రపంచం చాలావుంది. అది కొంతవరకు అర్థం చేసుకోవాలి. ఒకసారి వైవాహిక జీవితంలో ప్రవేశించానంటే యిక బయటకురావడం కుదరదు. అందుకనే నా యాంబిషన్ కొంతయినా తీరాకకాని వాటినిగురించి ఆలోచించదలుచుకోలేదు' అనేది. ఆమెమాటలు ఆలోచిస్తూవుండేవాడిని. అందరికీ ఆమె




కున్నంత మాత్రం జ్ఞానవుంటే యీ డైవర్సుల సంఖ్యలో సగం తగ్గేవి అనుకునేవాడిని.

సూసన్ కోరికలకు, మిష్టర్ విల్సన్ చెప్పిన విషయాన్ని సమన్వయపరుచుకోలేకపోయాను.

ఇవాళ ఏదయితే మర్చిపోవాలని ప్రయత్నిస్తున్నానో అదే యింకో రూపంలో ఎదురయింది 'ఏమిటీ వింత?.. ఎందుకిలా ప్రకృతి పగబట్టి స్త్రీని సాధిస్తోంది?' అనుకున్నాను బరువుగా.

కిందటిసారి క్రిష్టమస్‌కు వచ్చినప్పుడు సూసన్ కుటుంబంతోపాటు నేనూ వెళ్ళాను ఎయిర్‌పోర్టుకు, సూసన్‌కు వీడ్కోలు యివ్వడానికి. సూసన్, యింకా కొంతమంది స్నేహితులు కలసి సెలవల్లో మయామి, ఫ్లోరిడా మొదలయిన ప్రదేశాలు చూడటానికి వెళ్లారు. నేనున్న భాగంలో డిసెంబర్ నెలలో చలి గడగడలాడిస్తూంటే, సూసన్ వాళ్ళు వెళ్ళిన వూళ్ళల్లో హాయిగా వెచ్చగా వుంటుంది. అక్కడ అందరూ కలసి న్యూయియర్ ముందు రాత్రి పార్టీ చేసుకుంటూంటే యీ అపాంతరం జరిగింది. తత్ఫలితంగా సూసన్ తల్లికాబోతూంది.

ఈ విషయం విల్సన్ ద్వారా వినగానే నాకు మతిపోయిందనిపించింది. ఇరవై ఏళ్ళ సూసన్‌కు కాలేజీ చదువులో

యింకా ఒక సంవత్సరం వుంది. యింకా యింకా ఎన్నో చదవాలని ఎదురు చూస్తున్న యీ వయస్సులో యీ అవాంతర మేమిటి? సూసన్ ఏం చేస్తుంది? తన ఖర్మ యింతే అని రాజీపడుతుందా? లేక ఎదురునిలచి సాధిస్తుందా? ఏం సాధిస్తుంది? తండ్రి లేకుండా, వివాహం అనే సంఘ ఆమోదముద్ర లేకుండా పిల్లను పెంచుతుందా? లేక ఎవరికన్నా యిచ్చేసి?...

ఇంక ఆలోచించే శక్తి లేకపోయింది. నా కళ్ళముందు యిద్దరువ్యక్తులు వదలకుండా మెదులుతున్నారు. నాతోపాటు రక్తం పంచుకుపుట్టిన చెల్లెలు హేమ. ఎంతో ఆత్మీయత చూపించిన స్నేహితురాలు. యిద్దరూ ఒకేసమస్యకు ఎదురయ్యారు. ఒకరు మగవాడి కబంధ హస్తాలక్రింద నలిగిపోతే, మరొకరు దైహిక బలహీనతకు లొంగిపోయారు. ఎన్నో ఆశలు సమకూర్చుకుని, అందమయిన జీవితంకోసం ఎదురు చూస్తున్నది ఒకరు; ఆశలన్ని అడియాసలు అయి, బ్రతుకంతా మోడయిపోయి విలపించింది మరొకరు...

ఈ యిద్దరిని పోల్చకుండా వుండలేకపోయాను. ఒక్కక్షణం యీ యిద్దరిలో అదృష్టాన్ని వెతకబోయాను. నాకు దొరికింది ఏమీలేదు నిద్రలేని రాత్రితప్ప...

మెళకువ వచ్చేసరికి గదంతా తెల్లని వెలుతురుతో నిండిపోయింది. బట్టలు మార్చుకుని బయటకు వచ్చాను. చుట్టూ వున్న చెట్లమీదనుంచి వచ్చే గాలి మూలంగా అలసట అంతా తీరి ఫ్రష్‌గా వున్నట్లనిపించింది. అయినా, కళ్లు ఎరుపెక్కి మండసాగాయి. క్రిందకు దిగి వచ్చేసరికి మిసెస్ విల్సన్ బ్రెక్‌ఫాస్టు టేబుల్ సర్దుతోంది. విల్సన్ సోఫాలో కూర్చుని పేపరు తిరగేస్తున్నాడు. నన్ను చూడగానే పేపరు మడిచి పక్కకు పెడుతూ, 'గుడ్‌మార్నింగ్ షిరినివాస్' అన్నాడు.

'గుడ్‌మార్నింగ్' అన్నాను తిరిగి. నా గొంతుక మందంగా వినిపించింది_ రాత్రి నిద్రలేకపోవడం వలనకాబోలు.

బ్రెక్‌ఫాస్టుదగ్గర సూసన్ కనిపించింది. నవ్వుతూ పలకరించింది. నేనూ పలకరించబోయాను. కాని ఎందుకో మామూలుగా లేననిపించింది.

తల వంచుకుని మౌనంగా, తినసాగాను; మధ్యమధ్య సూసన్‌వంక చూస్తూ. సూసన్‌కూడా పరధ్యానంగా వున్నట్లు తోచింది.

సూసన్‌ని చూస్తూవుంటే మా పరిచయమయినప్పటినుండి రకరకాల సంఘటనలు గుర్తుకు వచ్చాయి. సూసన్ సహజంగా చలాకీ అయినఅమ్మాయి. అందులో అమెరికన్ ఆడపిల్లలకు మనలా హద్దులు కూడావుండవు. ఇండియాలో మన పద్ధతులన్నీ వివరంగా అడిగి తెలుసుకుంటూ

వుండేది. సూసన్‌ని అన్నిటికంటె విపరీతంగా ఆశ్చర్యపరిచింది మన పెళ్ళి

'జీవితమంతా కలిసివుండాల్సిన ఇద్దరకు ఒకరినిగురించి ఒకరికి ఏమీ తెలియకుండా పెళ్లేమిటి?' అనేది.

'అన్నీ తెలిసి చేసుకుంటున్న పెళ్ళిళ్లు మాత్రం ఏం సవ్యంగా వుంటున్నాయి?' ప్రశ్నించేవాడిని. కాని నా వాదన నాకే నచ్చేదికాదు ఒక్కొక్కప్పుడు. కేవలం సమర్థిస్తున్నానేమో అనిపించేది.

సూసన్‌తో మాట్లాడినప్పుడల్లా ఒక అనుమానం వెన్నంటి ప్రశ్నించేది: మన పెళ్ళిళ్లల్లో చాలాభాగం సరిగ్గానే వుంటాయి. యిందుకు కారణం ఏమిటి? ...సరిగా వున్నట్లు కనిపించేవాళ్ళు, నిజంగానే సుఖంగా వుంటున్నారా?... లేక గత్యంతరంలేక సర్దుకుపోతారా?... ఎన్ని వందలసార్లు ఆలోచించినా నాకు సమాధానం తోచేదికాదు.

బ్రెక్‌ఫాస్టు అయ్యాక యిద్దరూ చర్చికి బయలుదేరారు. నన్నూ రమ్మనమన్నారు. నాకు పెద్దగా విగ్రహారాధన మీద నమ్మకంలేదు. అందుకనే వాళ్లు రమ్మనమన్నప్పుడల్లా వెళ్ళివచ్చేవాడిని. అక్కడ చర్చిలో వున్నంత సేపు ఎలా టైము గడిచిపోయేదో తెలిసేదికాదు.

ఆ పూట మామూలుగా నేనూ బయలుదేరాను. కాని సూసన్ రానంది. మరేమీ మాట్లాడకుండా వాళ్ళిద్దరూ వెళ్ళేందుకు సిద్ధమవసాగారు. సూసన్‌కు కంపెనీగా వుందామని నేనూ యింట్లోనే వుండిపోయాను.

కొంతసేపు మా యిద్దరిమధ్య కొన్ని క్షణాలు మౌనంగా దొర్లిపోయాయి.

"హౌ ఆర్ యు శిరినివాస్ హౌ యీజ్ ఎవ్విరితింగ్ విత్ యు" అంది.

సూసన్ అంత ఫార్మల్‌గా మాట్లాడే టప్పటికి నాకేమిటోగా అనిపించింది. 'ఇండియన్ పేర్లకు సామాన్యంగా అర్థాలు వుంటాయటగా. నీ పేరుకు అర్థమేమి'టని అడిగింది ఒకసారి. నాకు తోచిందేదో చెప్పాను. అప్పటినుండి రిచ్‌మాన్ అనో ట్రెషర్ హౌస్ అనో పిలుస్తూ జోక్ చేస్తూవుండేది.

ఎప్పుడూ ఏదో హస్కు వేసుకుని కూర్చునే మాకు ఆరోజు మాటలే కరువయ్యాయి. చివరకు యిద్దరం బయటకు వెళ్ళాం. వాతావరణం చాలా బావుంది. అప్పుడే సూర్యుడు కొద్దిగా వేడెక్కుతున్నాడు. విల్సన్ పొలంలో పని ఆ సంవత్సరం అట్టే చురుగ్గా సాగుతున్నట్లు కనుపించలేదు. అదే మాట అన్నాను సూసన్‌తో. నవ్వి వూరుకుంది.

"బాగా అలసినట్లు కనుపిస్తున్నావు. రాత్రి నిద్రపట్టలేదా?" అడిగింది సూసన్.

మౌనంగా తలవూగించి వూరుకున్నాను. నాకు సూసన్‌తో ఏదో మాట్లాడాలనివుంది మనసులో. సూసన్‌కుకూడా మాట్లాడాలనిపించిం దనుకుంటాను. కాని మా యిదరిలో ఏ ఒక్కరికిసంభాషణ ఎలా

మొదలుపెట్టాలో తెలియక, చాలా సేపు అవీయివీ మాట్లాడుతూ కూర్చున్నాం.

"ఏంచేద్దా మనుకుంటున్నావు యీ సంవత్సరం?" అన్నాను యధాలాపంగా.

కొద్దినిమిషాలు మాట్లాడలేదు. "స్టూలు మానేస్తా ననుకుంటాను యీసంవత్సరం" అంది మందంగా.

అర్థంకానట్టు చూశాను.

'పరిస్థితి నీకు తెలిసేవుంటుంది,' అంది ఎటోచూస్తూ.

ఏం సమాధానం యివ్వాలో తెలియని వాడిలా వుండిపోయాను. "పెళ్ళి చేసుకోవడానికి యిష్టపడలేదా?" అన్నాను చాలా సేపటికి.

"ఎవరూ?" అంది అయోమయంగా.

ఆశ్చర్యంతో చూశాను అర్థంకాక.

కొద్దిక్షణాలు మౌనంగా గడిపి అంది. "ఒకసారి చేసిన పొరపాటును దిద్దుకుందామని, యింకో పొరపాటు చెయ్యమన్నావా?"

కర్తవ్యం తోచలేదు. "మరి ఏంచేద్దా మనుకుంటున్నావు?" అన్నాను చివరకు.

"ఏమో! యింకా నిశ్చయంగా తెలియదు. పెళ్ళిగాని తల్లుల నర్సింగ్ హోమ్‌కు వెడతానేమో!"

"అతనికీ విషయం తెలుసా?" అడిగాను జిజ్ఞాసతో.

"ఇప్పుడు తెలియకపోయినా, ముందుముందు తెలుస్తుంది. కాని అందువల్ల పెద్దప్రయోజనం ఏముంది?" అంది నిర్లిప్తంగా.

"పెళ్ళి చేసుకుని వుండచ్చుగా!" అన్నాను నా ధోరణిలో నే సాగిపోతూ.

"అందువల్ల ఒక సమస్యను వారిస్తున్నా మనుకుంటూ మరోసమస్యకు అవకాశ మిస్తున్నామన్నమాట. మా యిద్దరికి పెళ్ళి చేసుకోవాలన్న ఉద్దేశంలేదు. యిప్పుడు పరిస్థితుల మూలంగా..."

"పెళ్ళనేది అయితే ఒకరిమీద ఒకరికి యిష్టం కలుగుతుందేమో!"

"అది కాదుకదా యిప్పుడు సమస్య. అతనంటే యిష్టం, అయిష్టం అన్న ప్రశ్నేలేదు. నేను యింతమటుకు అసలు పెళ్ళి, సంసారంగురించి ఆలోచనే చేయలేదు. నాకసలటువంటి ఉద్దేశమేలేదు. అటువంటిది పరిస్థితులతో రాజీపడి అసంతృప్తిగా అందులో జొరపడితే ఎవరికీ సుఖ ముంటుందనుకోను. అసంతృప్తితో మే మిద్దరమూ ... మా యిద్దరకు మధ్య పెరిగే బిడ్డకుమాత్రం ఏం మంచి జరుగుతుంది?" అంది నిశ్చలంగా.

మబ్బులుకమ్మిన ఆమె ముఖాన్ని చూచే ధైర్యంలేక వూరుకున్నాను. ఆమె మనోనిబ్బరానికి, ధైర్యానికి ఎంతయినా ఆశ్చర్యం కలిగింది. రకరకాల భావాలు చుట్టుముట్టూవుంటే, తటస్థంగా నిలబడిపోయాను. సూసన్‌గురించి రేగే ఆలోచనలకు ఒకరూపం ఏర్పడలేదు.



ఎంత తేడా? యిదే జీవితసమస్య. ఎందరిని ఎన్నివిధాలుగా ఎదుర్కొంటోంది. ఎందరికి ఎన్నిరకాలుగా అంతమవుతోంది? ఎలాంటి దుస్థితి ఏర్పడ్డా నిర్భయంగా నిలబడి, కనీసం తిరిగి సంఘంలో నిలచేందుకు శక్తి వుంది సూసన్‌కు. పెంపకానికి వెళ్ళినా, 'మా అమ్మ, నాన్న! నా యిల్లు' అంటూ గౌరవంగా పెరిగే అవకాశం వుంది బిడ్డకు. కాని...యిదే పరిస్థితిలో...హేమ...

"ఇలాంటి పరిస్థితిలో యిరుక్కున్న నన్ను చూచి ఒక స్టుపిడ్ అనుకుంటూ వుండివుంటావు" అంది సూసన్ నిశ్శబ్దంగా, ఆలోచనా ప్రవాహంలో కొట్టుకుపోతున్న నన్ను చూచి.

ఆమెవంక వెర్రిగా చూశాను ఒక

క్షణం. "నిన్నుగురించి ఏమనుకుంటు న్నానో తెలుసా సూసన్?" ఆగాను ఒక నిముషం. "నీ జీవితంలో యింత చెడు జరిగినా నువ్వు అదృష్టవంతురాలివే అను కుంటున్నాను" అన్నాను తగ్గుస్థాయిలో.

ఎగురుతున్న పక్షులవంక చూస్తూ నిలబడిపోయింది. నేనేదో జోక్ చేస్తున్నా నన్నట్లు చూసి, "అదృష్టవంతురాలినా? ...జీవితంలో ఎన్నో చెయ్యాలని ఆశించాను. ఏవేవో సాధించాలని అనుకున్నాను. అనుకోని విధంగా యీ అంతరాయం కలిగింది. బహుశ నేను అనుకున్నదానికంటే ఓ రెండేళ్ళు ఆలశ్యంగా నేను కోరినవి చెయ్యగలనేమో! కాని యీ దుస్సంఘటన నన్ను వెంటాడుతూనే వుంటుంది. ఈ ఓటమి నన్ను పరిహసిస్తూనే వుంటుంది. నేను అదృష్టవంతురాలినని ఎన్నడూ అనుకోను. నా జీవితంలో నాకు పెళ్ళి, సంసారం, పిల్లలూ కావాలి. కాని ఇలా కాదు- వాటిని నేను మనస్ఫూర్తిగా కోరిన నాడు, వాటి అవసరం నాకున్నదని నేను నమ్మిననాడు..." అంది. ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆమెతో ఏవేవో చెప్పాలనిపించింది నాకు.

"సూసన్... నేను నిన్ను అదృష్టవంతురాలివి అన్నప్పుడు నిన్ను పరిహసిస్తున్నాననుకుని వుంటావు. కాని కాదు. నిన్న నేనిక్కడకు ఎందుకొచ్చానో తెలుసా?" అన్నాను.

మాట మార్చాలనుకున్నా ననుకున్న ట్లుంది. "నీ దేశంమీదకు మనసు పోయి వుంటుంది" అంది నవ్వాలని ప్రయత్నిస్తూ.

"ఒక విధంగా నిజమే! నిన్నటి రోజును మర్చిపోవాలని ఎన్నాళ్లగా ప్రయత్నిస్తున్నానో నీకు తెలియదు. ఎంత వద్దనుకున్నా, ప్రతి సంవత్సరం గుర్తుకురావడం, మనసు పాడవడం జరుగుతూనేవుంటుంది. నిన్ననామనసంతా చెడిపోయింది.ఏవేవోజ్ఞాపకాలుమనస్సును తవ్వసాగాయి. ఎక్కడికయినా వెడితే తప్ప బాగుండదనిపించింది. అందుకే నిన్న ఇక్కడకు వచ్చాను. కాని నిన్న ఈ సంగతి విన్నాక, నే నేదయితే మరవాలనుకుంటున్నానో అదే ఎదుటికి వచ్చిందనిపించింది. కాని నేను మరవాలనుకునే సంఘటనకు, యిప్పుడు ఎదురయిన పరిస్థితికి సహస్రాంతం తేడా వుంది. అందుకే అన్నాను నువ్వు అదృష్టవంతురాలివని.

నాకు ఓ చెల్లెలు వుండేది. బహుశా నీ వయసే వుండివుండేదనుకుంటాను. మా దేశం ఎన్ని విషయాలలో అభివృద్ధి చెందుతున్నా ఆచారాలు, అలవాట్లలో మాత్రం యింకా వెనకబడేవుంది. మా కుటుంబంకూడా పాత ఆచారాలను వదలకుండా అనుసరిస్తూనే వుండేది. ఆ కారణంగానే మా చెల్లెలికి 13 ఏళ్ళప్పుడు మా అత్త కొడుకుతో పెళ్ళి జరిగింది..."

"కజిన్‌తోనా పెళ్ళి?" అంది ఆశ్చ ర్యాన్నంతా కళ్ళల్లో ఇనుమడింప చేస్తూ.

చిన్నగా నవ్వాను, ఆమె ఆశ్చర్యా నికి. "మా వైపు అది యింకా చాలా మామూలు. బంధువులలో పెళ్ళిళ్ళు జరుగుతూనే వుంటాయి... దురదృష్ట వశాత్తు నాలుగు నెలలు తిరగకుండానే మా బావ చనిపోయాడు."

"అంటే మీ చెల్లెలికి వైవాహిక జీవితం గడిపే అవకాశమే కలగలేదన్న మాట," అంది సానుభూతిగా.

"మా దేశంలో అలాటివాళ్ళ బ్రతు కంతా చీకటే! అంతకీ నేను మా నాన్నతో అంటూనే వుండేవాడిని మళ్ళీ పెళ్ళి చేద్దామని. కాని పాత పద్ధతులు, ఆచారాలను గాఢంగా నమ్మే ఆయనకు, ఈ పని యిష్టం వుండేదికాదు. మా వాద నలు జరుగుతూండగానే మూడేళ్ళు జరిగి పోయాయి. నా డిగ్రీ వచ్చింది. ఉద్యో గంలో చేరాను. ఒకసారి మార్చినెలలో ఒక వారం రోజులు శలవు తీసుకుని యింటికి వెళ్ళాను.

నేను వెళ్ళేసరికి మా అమ్మా, నాన్న చాలా కృంగిపోయినట్లు కనుపించారు. నే నెప్పుడు వెళ్ళినా ఎదురొచ్చే మా చెల్లెలు వునికి తెలియలేదు. దూర దూరంగా తిరుగుతున్న మా అమ్మను చూసి యిక అడగలేక అడిగాను, ఏమైందని? మా అమ్మ అసలు విషయం చెప్పి గుండె పగిలేలా ఏడ్చింది. మా యింటి చుట్టుపక్కల ఎవరో అబ్బాయి అద్దెకు వచ్చాడట. అతను మెల్లిగా మా చెల్లెలికి మంచి మాటలు చెప్పి మోసగించాడు. పెళ్ళి చేసుకుంటానని నమ్మించాడు.

ఈ విషయం విన్న నాకు మతి పోయి నట్లయింది. ఎలాగయినా ఆ అబ్బాయిని వెతికి పట్టుకుని, పెళ్ళి జరిపించాలని నిశ్చయించుకున్నాం. చివరకు ఆ అబ్బాయి దొరికినా పెళ్ళి జరిపించడం సాధ్యం కాలేదు. బ్రతిమాలినా, భయ పెట్టినా దేనికీ లొంగలేదు అతను. ఆఖరికి మా నాన్నకున్న ఆస్తంతా ఇచ్చ యినా పెళ్ళి చెయ్యాలని నిశ్చయించు కున్నాం. అదీ కుదరలేదు. ఆ క్షణంలో అంత యిష్టం లేకుండా బలవంతాన పెళ్ళి జరిపిస్తే మా చెల్లెలు సుఖపడు తుందా అన్న ఆలోచన మాకు కలగనే లేదు. దీని అంతటికీ ఒకటే కారణం – ఎలాగో అలా పెళ్ళి జరిపించేస్తే, పాత తప్పిదాన్ని కప్పి, మా పరువుప్రతిష్ఠల్ని మా చెల్లెలి జీవితాన్ని నిలపడానికి వీలవు తుంది.

ఇక ఆఖరి ప్రయత్నంగా డాక్టర్‌కు లంచం యివ్వడానికి నిర్ణయం చేశాం... కాని అది జరిగేలోపలే దాని జీవితం ఆఖరయింది. అలాంటి స్త్రీకి సంఘంలో స్థానం లేదని తెలుసుకునేందుకు ఎక్కువ

సేపు పట్టలేదు. అలాంటి దుస్థితిని ఎదుర్కొనే శక్తిలేక అక్కడికక్కడే జీవితం అంతం చేసుకున్న అభాగ్యురాలు మా చెల్లెలు.

ఇది జరిగి మూడు సంవత్సరాలు దాటింది. కాని మర్చిపోవడం అనేది జరుగుతుందని అనుకోను. ఇలాంటి పని చేయడం అనేది ఎటువంటి సొసైటీలో నయినా తప్పే! కాని దిద్దుకోదల్చుకున్న వాళ్ళకు అవకాశమే వుంటే...

నిన్ను నేను సమర్థించినట్లు, మరొకరు సమర్థించలేరు. నేనయినా మరో పరిస్థితిలో యీ పనిని అసహ్యించుకునే వాడినే! బాధను అనుభవించినవాడే బాధను అర్థం చేసుకోగలడు. ఒక అన్యాయానికి బలి అయినవారే, ఆ అన్యాయం జరగకుండా వుండాలని కాంక్షిస్తారు." అంటూ సూసన్ ముఖం వంక చూశాను. ఆమె నీలి కన్నులు నీళ్ళతో మిలమిలా మెరవసాగాయి.

"షిరినివాష్! ఈ దుర్ఘటనే జరగకుండా వుండివుంటే ఏమయివుండేది?" అంది ఎటో చూస్తూ సుదీర్ఘంగా నిట్టూర్చి.

"ఏమో మా నాన్న నా మాట విని వుంటే, పెళ్ళి జరిగేదేమో? లేకుంటే మా తోనే వుండేది జీవితాంతం."

చాలా సేపు మా యిద్దరి మధ్యా నిశ్శబ్దం ఆవరించింది. సూసన్ వైపు రెండు మూడుసార్లు చూశాను యథాలాపంగా. కాని ఆమె మనసు ఎక్కడెక్కడో విహరిస్తున్నట్లు గ్రహించగలిగాను. మధ్య, మధ్య పక్షుల కిలకిలలు, చెట్లగాలికి వస్తున్న సవ్వడులు తప్ప మరే యితర శబ్దమూ లేదు.

"థాంక్యూ షిరినివాస్, థాంక్యూ" అంది చాలా సేపటి తరువాత మెల్లిగా.

ఆశ్చర్యంగా ఆమెవంక చూశాను.

"ఎందుకు?"

"యు మేడ్ మి ఫీల్ బెటర్. ఐ గెస్ యు రైట్ ఆఫ్టరాల్, అయామ్ ఎ లక్కీ పర్సన్." అంది చిరునవ్వుతో. ఆమె కళ్ళనిండా వున్న నీళ్లు జలజలా రాలిపడ్డాయి.



"కజిన్‌తోనా పెళ్ళి?" అంది ఆశ్చర్యాన్నంతా కళ్ళల్లో ఇనుమడింప చేస్తూ.

చిన్నగా నవ్వాను, ఆమె ఆశ్చర్యానికి. "మా వైపు అది యింకా చాలా మామూలు. బంధువులలో పెళ్ళిళ్ళు జరుగుతూనే వుంటాయి... దురదృష్ట వశాత్తు నాలుగు నెలలు తిరగకుండానే మా బావ చనిపోయాడు."

"అంటే మీ చెల్లెలికి వైవాహిక జీవితం గడిపే అవకాశమే కలగలేదన్న మాట," అంది సానుభూతిగా.

"మా దేశంలో అలాటివాళ్ళ బ్రతుకంతా చీకటే! అంతకీ నేను మా నాన్నతో అంటూనే వుండేవాడిని మళ్లీ పెళ్ళి చేద్దామని. కాని పాత పద్ధతులు, ఆచారాలను గాఢంగా నమ్మే ఆయనకు, ఈ పని యిష్టం వుండేదికాదు. మా వాదనలు జరుగుతూండగానే మూడేళ్ళు జరిగిపోయాయి. నా డిగ్రీ వచ్చింది. ఉద్యోగంలో చేరాను. ఒకసారి మార్చినెలలో ఒక వారం రోజులు శలవు తీసుకుని యింటికి, వెళ్ళాను.

నేను వెళ్ళేసరికి మా అమ్మా, నాన్న చాలా కృంగిపోయినట్లు కనుపించారు. నే నెప్పుడు వెళ్లినా ఎదురొచ్చే మా చెల్లెలు వునికి తెలియలేదు. దూర దూరంగా తిరుగుతున్న మా అమ్మను చూసి యిక అడగలేక అడిగాను, ఏమైందని? మా అమ్మ అసలు విషయం చెప్పి గుండె పగిలేలా ఏడ్చింది. మా యింటి చుట్టుపక్కల ఎవరో అబ్బాయి అద్దెకు వచ్చాడట. అతను మెల్లిగా మా చెల్లెలికి మంచి మాటలు చెప్పి మోసగించాడు. పెళ్ళి చేసుకుంటానని నమ్మించాడు.

ఈ విషయం విన్న నాకు మతి పోయినట్లయింది. ఎలాగయినా ఆ అబ్బాయిని వెతికి పట్టుకుని, పెళ్ళి జరిపించాలని నిశ్చయించుకున్నాం. చివరకు ఆ అబ్బాయి దొరికినా పెళ్ళి జరిపించడం సాధ్యం కాలేదు. బ్రతిమాలినా, భయపెట్టినా దేనికీ లొంగలేదు అతను. ఆఖరికి మా నాన్నకున్న ఆస్తంతా ఇచ్చయినా పెళ్ళి చెయ్యాలని నిశ్చయించుకున్నాం. అదీ కుదరలేదు. ఆ క్షణంలో అంత యిష్టం లేకుండా బలవంతాన పెళ్ళి జరిపిస్తే మా చెల్లెలు సుఖపడుతుందా అన్న ఆలోచన మాకు కలగనే లేదు. దీని అంతటికీ ఒకటే కారణం – ఎలాగో అలా పెళ్లి జరిపించేస్తే, పాత తప్పిదాన్ని కప్పి, మా పరువుప్రతిష్ఠల్ని మా చెల్లెలి జీవితాన్ని నిలపడానికి వీలవుతుంది.

ఇక ఆఖరి ప్రయత్నంగా డాక్టర్‌కు లంచం యివ్వడానికి నిర్ణయం చేశాం... కాని అది జరిగేలోపలే దాని జీవితం ఆఖరయింది. అలాంటి స్త్రీకి సంఘంలో స్థానం లేదని తెలుసుకునేందుకు ఎక్కువ

సేపు పట్టలేదు. అలాంటి దుస్థితిని ఎదుర్కొనే శక్తిలేక అక్కడికక్కడే జీవితం అంతం చేసుకున్న అభాగ్యురాలు మా చెల్లెలు.

ఇది జరిగి మూడు సంవత్సరాలు దాటింది. కాని మర్చిపోవడం అనేది జరుగుతుందని అనుకోను. ఇలాంటి పని చేయడం అనేది ఎటువంటి సొసైటీలోనయినా తప్పే! కాని దిద్దుకోదల్చుకున్న వాళ్ళకు అవకాశమే వుంటే...

నిన్ను నేను సమర్థించినట్లు, మరొకరు సమర్థించలేరు. నేనయినా మరో పరిస్థితిలో యీ పనిని అసహ్యించుకునే వాడినే! బాధను అనుభవించినవాడే బాధను అర్థం చేసుకోగలడు. ఒక అన్యాయానికి బలి అయినవారే, ఆ అన్యాయం జరగకుండా వుండాలని కాంక్షిస్తారు," అంటూ సూసన్ ముఖం వంక చూశాను. ఆమె నీలి కన్నులు నీళ్ళతో మిలమిలా మెరవసాగాయి.

"షిరినివాష్! ఈ దుర్ఘటనే జరగకుండా వుండివుంటే ఏమయివుండేది?" అంది ఎటో చూస్తూ సుదీర్ఘంగా నిట్టూర్చి.

"ఏమో మా నాన్న నా మాట విని వుంటే, పెళ్ళి జరిగేదేమో? లేకుంటే మా తోనే వుండేది జీవితాంతం."

చాలా సేపు మా యిద్దరి మధ్యా నిశ్శబ్దం ఆవరించింది. సూసన్ వైపు రెండు మూడుసార్లు చూశాను యథాలాపంగా. కాని ఆమె మనసు ఎక్కడెక్కడో విహరిస్తున్నట్లు గ్రహించగలిగాను. మధ్య, మధ్య పక్షుల కిలకిలలు, చెట్లగాలికి వస్తున్న సవ్వడులు తప్ప మరే యితర శబ్దమూ లేదు.

"థాంక్యూ షిరినివాస్, థాంక్యూ" అంది చాలా సేపటి తరువాత మెల్లిగా.

ఆశ్చర్యంగా ఆమెవంక చూశాను. "ఎందుకు?"

"యు మేడ్ మి ఫీల్ బెటర్. ఐ గెస్ యు రైట్ ఆఫ్టరాల్, అయామ్ ఎ లక్కీ పర్సన్," అంది చిరునవ్వుతో. ఆమె కళ్ళనిండా వున్న నీళ్లు జలజలా రాలిపడ్డాయి.



# పైపై పటాటోపం

మద్రాసునుండి తన స్నేహితురాలయిన భాను వ్రాసిన ఉత్తరం చదివి రూప చాలా సంతోషపడింది. ఎంతో కాలంగా తాను ఆహ్వానింపగా తన మెడికల్ కాలేజీ ఫ్రెండ్స్ రాధ, అనీల, సుజాత, భాను అమలాపురం రావటానికి బయలుదేరారని చదివి వారిని ముక్తేశ్వరంలో రిసీవ్ చేసుకోవాలని నిశ్చయించుకొంది.

మరునాడు ఉదయమేలేచి స్నానం చేసి, కాఫీత్రాగి తెల్లని టెరీకాటన్ చీరపై పాలనురుగువంటి మాధవరం పట్టు జాకెట్టు వేసుకొని, 'ఇంఫాలా'కారులో ముక్తేశ్వరం బయల్దేరింది. బిలబిలలాడుతూ పడవలోనుండి దిగిన ఫ్రెండ్సును సంతోషంగా రిసీవ్ చేసుకొంది. తర్వాత అందరూ కారులో ఎక్కారు. రూప కారు స్టార్టుచేసింది. రూప ఫ్రెండ్స్ అంతా మద్రాసుకు, ఆ చుట్టుప్రక్కల ఊళ్ళకు చెందినవారు అవటంవల్ల 'గోదావరి'నది అందాన్ని పొగుడుతూ, కోనసీమ సౌందర్యాన్ని చూసి ఆశ్చర్యపోతున్నారు. కారు నెమ్మదిగా అమలాపురంచేరి కాలవ ఒడ్డునగల పెద్ద మేడముందు ఆగింది. రూప తిరిగి అందరినీ లోపలికి తీసుకొని వెళ్ళింది. రూప అమ్మగారు నాన్నగారు సాదరంగా ఆహ్వానించారు.

నౌకరు రంగన్న అందరికీ నీళ్ళు తోడగా స్నానాలు ముగించి వచ్చారు. రూప అమ్మగారు అందరికీ ఆప్యాయంగా కొసరి కొసరి వడ్డించారు. అంతా తృప్తిగా పులిహోరతో భోజనాలు చేసి విశ్రాంతిగా కూర్చుని కబుర్లు మొదలుపెట్టారు.

సాయంకాలం అందరూ షైరుకి కాలవ గట్టుకి బయలుదేరడానికి తయారయ్యారు. రాధ ముందుగానే, "అనీలా! నీవుగాని జీన్స్‌తో షైరుకి బయలుదేరావా రోడ్డుమీద యిక మేమెవరం నడిచే యోగం ఉండదు. యిక్కడ కుఱ్ఱ మూక మమ్మల్ని యెవరినీకూడ బ్రతకనివ్వరు. కాబట్టి నీవు నిక్షేపంగా చీర కట్టుకొని రా తల్లీ!" అని వ్యంగ్యంగా

---

సాయిబాలామణి విష్ణుమూర్తి

అంది. అంతా సాదాచీరలతో కాలవ గట్టుకి షైరు బయలు దేరారు. అలా కొస్త దూరం నడిచి ఒక తోటలో ప్రవే శించి మామిడిచెట్టుక్రింద కూర్చున్నారు. అకస్మాత్తుగా అనీలకు ఒక ఉయ్యాల కన్పించింది. దానిదగ్గరకు పరిగెత్తుకొని వెళ్ళి ఊగడం ప్రారంభించింది. ఇంతలో స్నేహితులందరూ ఒక సమాధి దగ్గరకు వెళ్ళడంచూసి తాను గూడ ఉయ్యాలవిడిచి పరిగెత్తింది. ఆమెకు సమాధిపై లతలతో కూడిన అక్షరాలు కనిపించాయి. కుతూహలంతో ఆ అక్షరాలవైపు చూసి "అనుభవించడానికి అన్నీ ఉండి ఆప్తుల నందరినీ విడిచిపోయిన అభాగిని వేంక టేశ్వరి'' అని చదివి, రూపని ఆ సమాధి వివరాలనుగూర్చి అడిగింది. అంత వరకూ ఎంతో ఉత్సాహంగా మాట్లాడు తున్న రూప దిగాలుపడిపోయి బొంగురు పోయినగొంతుకతో, "అది మా పిన్నిగా రమ్మాయి వేంకటేశ్వరిది. అది అంతా ఒకగాథ" అని నిట్టూర్చింది. అందరికీ ఆగాథ తెలుసుకోవాలని ఆసక్తి కలిగి, రూపను దానిని గూర్చి అభ్యంతరం లేక పోతే చెప్పవలసిందిగా కోరారు. రూప గాఢంగా నిట్టూర్పు విడిచి యిలా మొదలు పెట్టింది.

"నేనూ మా పిన్నిగారి అమ్మాయి వేంక టేశ్వరి యిదే మేడలోకలిసి చదువు కుంటూ ఉండేవాళ్ళం. మా యిద్దరికీ పి. యు. సి. లో క్లాసు వచ్చినట్లుగా పేప రులో చూసుకొని పొంగిపోయాం. యింతకాలం కలసి చదువుకొన్న మే మిద్దరం తిరిగి మెడిసిన్‌కూడ మద్రా సులో కలిసి చదువవచ్చుననుకొన్నాం, కాని విధి బలీయమైనది. మా ఆశలు అడియాసలైనాయి. మా పిన్ని వేంకటే శ్వరి పై చదువుకు ఒప్పుకోలేదు. ఏదో కట్నం యిచ్చి పెళ్ళిచేయక పై ఊళ్ళు పంపి పెద్దచదువు లెందుకంది. మా బాబాయిగారు యెదురు చెప్పలేకపోయారు. అందువలన నేను ఒక్కర్తినే మద్రాసు మెడికల్ కాలేజీలో చేరాను. ప్రతి సంవ త్సరమూ వేసవి సెలవలకు యిక్కడకు వస్తూ ఉండేదాన్ని. క్రిందటి సంవత్స రం సెలవలకు వచ్చినపుడు — అంటే సరిగ్గా యిదే రోజులలో–యెప్పుడూ చలా కీగా ఉండే వేంకటేశ్వరి ఏదో పోగొట్టు కున్నదానిలా కనిపించింది. కాని నా ఎదుట ప్రయత్నపూర్వకంగా తెచ్చిపెట్టు కొన్న ఉత్సాహంతోఉండేది. నేను ఎన్ని సార్లు అడిగినా కారణం చెప్పకుండా తేలికగా నవ్వేసేది. అంతా నా భ్రమే కాని వేంకటేశ్వరికి ఏ బాధా లేదని సంతృప్తి పడేదాన్ని. సెలవులు అన్నీ అక్కతో సరదాగా గడిపి మద్రాసు చేరాను.

మద్రాసుచేరిన నేను నా డైలీ రొటీ నులో పడిపోయాను. ఒకరోజు నేను 'ఎనాటమీ' ప్రాక్టికల్స్ పూర్తిచేసి,



అలసి హాస్టలుకు వచ్చేసరికి ఫ్రెండ్స్ అందరూ నాకు ఒక బేరింగ్ లెటర్ వచ్చిందని చెప్పారు. నేను ఆశ్చర్యంతో పోస్టుమాన్‌కి డబ్బుయిచ్చి ఆ ఉత్తరం ఎవరినుండి వచ్చిందో అన్న కుతూహలంతో విప్పి చదివాను.

"ప్రియమైన రూపకు,

వేంకటేశ్వరి వ్రాయునది. ఎన్నడూ ఉత్తరం వ్రాయని నేను వ్రాయడం ఆశ్చర్యంగా ఉంది కదూ! ఈ ఉత్తరం సావధానంగా చదువు. తరువాత నేను చేసిన పని మంచిదో కాదో నిర్ణయించు.

ఊహ తెలిసినప్పటినుండి డాక్టరును కావాలనుకొన్న నేను అమ్మ పట్టుదల వల్ల కాలేజీ పోయినాను. అమ్మ యిష్ట ప్రకారం వివాహమయినా డాక్టరునే చేసుకోవాలనుకొన్నాను. నీకు తెలిసే ఉంటాడు. డా॥ శ్రీరామ్. ఎర్రగా, సన్నగా, పొడవుగా ఉంటాడు. కాకినాడలో చదువుకునేవాడు. సెలవులలో ఈ ఊరికి వచ్చినప్పుడు మన యింటికికూడ వస్తూ ఉండేవాడు, అప్పుడప్పుడు. నీకు తెలుసుకదా! అమ్మకు, నాన్నగారికి కూడ నన్ను అతనికిచ్చి వివాహం చేయాలని ఉండేది. ఆ అభిప్రాయంతోనే అతను పిలవగానే షికారులకు కలిసి తిరిగినా చూసీ చూడనట్లు ఊరుకునేవారు. అతను తిరిగి కాకినాడ వెళ్ళేముందు నాన్నగారు వివాహ విషయం కదిపారు. ఆలోచించి తర్వాత వ్రాస్తానని కాకినాడ వెళ్ళి ఉత్తరం వ్రాసాడు. దానిని ఉత్తరం అనేకంటే చిత్రపధచేసే మిషను అంటే బాగుంటుంది. నేను తనతో చనువుగా ఉన్నట్లే అందరితో ఉండనని నమ్మకం ఏమిటని, నా ప్రవర్తననే శంకిస్తున్నానని, తాను తన 'కోర్సు' చదువుకొన్న రికికోఅనే ఆంగ్లయువతిని వివాహం చేసుకోవాలని నిశ్చయించుకొన్నట్లుగా వ్రాసాడు. అతని తిరస్కారంకంటె నా ప్రవర్తనని శంకించిన అతనితీరే నన్ను ఎక్కువ బాధపెట్టింది.

నాన్నగారు తిరిగి సంబంధాల వేటలో పడ్డారు - అన్నీచూసే ప్రదన్నయ్య ఉన్నప్పటికీ. యువతి నేను ఒక్కరినే ప్రేమించగలను. ఆ లేనినాడు ఆజన్మాంతం బ్రహ్మచారిగానే ఉండిపోవాలని నిశ్చయించు కొన్నాను. కాని అమ్మ నా మాట పెడచెవినిపెట్టి ఏదో యింజనీరు సంబంధ స్థిరపరచడానికి సన్నాహాలు ప్రారంభిచారు.

ఆ రోజు నా జీవితంలోనే మరపురాని రోజు. ఉదయమే అమ్మ, పెద్దమ్మ బాబయ్యగారు పిల్లలు ఉమ, రోజా రాజు, నీను అంతా పుల్లేటికుర్రు శాంత పెళ్ళికి బయలుదేరారు. కాని నేను వెళ్ళలేదు. అమ్మ నన్ను రమ్మని గట్టిగా అడగలేదు. కారణం నాకంటే సంవత్సరం చిన్నదయిన శాంత పెళ్ళికి వెళ్ళి అక్కడ అమ్మలక్కలు అనేమాటలు భరించలేనని తెలుసు. మన దాది రాజమ్మ, నౌఖరు రంగన్న ఉన్నారు. ఆరోజుసాయంకాలం నేనుచివరిసారిగానా అదృష్టాన్నిపరీక్షించుకోవాలనుకున్నాను. నాకు భవిష్యత్తులో సుఖం ఉన్నదా లేదా అని దేవుని ముందు లాటరీ వేయగా నాకు అక్కడ కూడా విధి ఎదురుతిరిగింది. చదువు విషయంలోను, వివాహ విషయంలో దెబ్బతిన్న నేను, మూడవసారి విధి నాపై చూపిన చిన్నచూపుకు తట్టుకోలేకపోయాను. యిష్టంలేని వివాహం చేసుకొని భవిష్యత్తును దుఃఖమయం చేసు




కునేకంటే ఇప్పుడే జీవితాన్ని ఆఖరు చేసుకోవడం మంచిదనిపించింది. అట్లా పెరటిలో నడుస్తున్న నాకు, చేలకువేయించడానికి క్రిందటి రోజు తెప్పించిన 'ఎండ్రిన్' డబ్బా నా కేదో కర్తవ్యాన్ని బోధిస్తున్నట్లుగా తోచింది. వెంటనే నీకీ ఉత్తరం వ్రాస్తున్నాను. నీవిది చదివేటప్పటికి నీ అక్క వేంకటేశ్వరి దహన సంస్కారాలు కూడ పూర్తి అయిపోతాయి.

నా ఈ మరణానికి ఎవరూ బాధ్యులు కారు. చదువు మాన్పించిన తల్లినికానీ, నా వివాహ విషయంలో సరిఅయిన నిర్ణయం చేయలేకపోయిన తండ్రినికాని, బాధ్యతా రహితంగా నాపై నిందవేసిన శ్రీరామ్‌నుగాని నేను నిందించలేను. కాని నాకు ఏలోటులేకుండా చూసిన అన్నయ్య ప్రసాద్‌ను, యిన్నాళ్ళుగానిన్ను మధ్యపెట్టి భ్రమకలిగించినందుకు నిన్ను ఆఖరిసారిగా క్షమార్పణ కోరుకొంటున్నాను. నాన్నగారు నా వివాహానికై 15000 రూ॥ లు బ్యాంకులో నా పేరిట వేసారు. దానిని నీవు ప్రసాద్ అన్నయ్య సహాయంతో మెడికల్ కాలేజీలో ఒక పేదవిద్యార్థికి స్కాలర్‌షిప్‌గా ఉపయోగించు.

చదువు పూర్తికాక, కోరినవరుడు లభించక అమ్మలక్కల వాగ్బాణములు భరించలేక నీ అక్క వేంకటేశ్వరిచేసిన సాహసానికి నీవు నిందించవని తలుస్తాను. ఆత్మహత్య అంటే నాకుగల

నీచాభిప్రాయం నీకు తెలుసుకదా! అటు వంటి నేను ఈ పని ఒక క్షణంలో నిర్ణయించు కున్నాను. దీనివలన మనవంశానికి తీరని మచ్చ అని ఊహించగలను. కాని దైవానికి నా మరణం యిష్టమే కాబోలు ఈరోజు పున్నమినాటి రేయి అయినా నా పాలిట కాళరాత్రి అయింది ఈ ఉత్తరం ముగించి, రాత్రి 10 గంటలకు ఒక గుక్కెడు ఎండ్రిన్ తాగుతాను.

యిహ లోకంలో నిన్ను యిక చూడలేని నిర్భాగ్యురాలయిన

—నీ అక్క.

ఎన్. బి. పరిస్థితులను అర్థం చేసుకొని నా మరణాన్ని అపార్థం చేసుకోవని విశ్వసిస్తాను."

అని వ్రాసింది." అని గద్గదంగా రూప చెప్పింది. గొంతు సవరించుకొని, కన్నీళ్ళు తుడుచుకొని తిరిగి ఆరంభించింది.

"ఉత్తరం అందిన వెంటనే యింటికి బయలుదేరాను. హాలులో అడుగుపెట్టే సరికి పూలదండతో అలంకరించబడిన వేంకటేశ్వరి ఫోటో కన్పించింది. ఒక కంచాన తిని, ఒకమంచాన పడుకొన్న మా బాంధవ్యం మరపురానిదై నన్ను చాలా బాధపెట్టింది. అమ్మ, పిన్నిల దుఃఖాన్ని ఆపడం నా వశంకాలేదు. మాదాది రాజమ్మదగ్గర చేరి వేంకటేశ్వరి యిటువంటిపని ఎందుకుచేసిందని అడిగాను.

రాజమ్మ ఏడుస్తూ, 'తల్లీ! పెదపాపకి ఆ డాక్టరు సంబంధం కాదనడమే ముప్పు వచ్చింది. అసలు ఆ బాబుని రానియ్యకుండా ఉండవలసింది. ఆ బాబు చేసుకోను అనడంతోనే యీ అమ్మ విరక్తి చెందేరు. ఆ బాబుకి పెద్దపదవుల కాంక్ష ఎక్కువ కాబోలు; ఎవరో ఇంగ్లీషు అమ్మాయిని చేసుకొంటే అమెరికాలో చదువుకోవచ్చునంట. అందుకని పెద పాపను కాదని వ్రాస్తూ తాను చనువుగా ఉండటాన్ని అపార్థం చేసుకుంటారని ముందరికాళ్ళకు బంధంగా అమ్మాయిగారి ప్రవర్తనని శంకిస్తున్నానని వ్రాసారు.

పాపిష్టిదాన్ని! ఆరోజు సాయంత్రం అమ్మాయిగారు, 'దాదీ! నిన్ను యింక చూస్తానో లేదో' అని విచారంగా అన్నప్పుడు కూడా యిటువంటి అఘాయిత్యపు పని చేస్తారని అనుకోలేదు. అందరిలోకి అణకువగా పెద్దతరహాగా ఉండే పెద పాప యింతపని చేసిందంటే ఆ యమ్మ ఎంత నరకం అనుభవించిందోనమ్మా మనస్సులో,' అని ఏడుస్తూ చెప్పింది" అని రూప హృదయ విదారకంగా ముగించింది.

అంతా విన్న తరువాత అందరి హృదయాలలోను విచారం అలుము కొన్నట్లుగాఎఱ్ఱనిసంధ్యారుణ కాంతిపోయి నలుపైపుల చీకట్లు అలుముకున్నాయి. కాని అందరిలోకి అనీల మొహం

ఎక్కువగా పాలిపోవటం ఎవరూ గమ నించలేదు. తోటమాలి కోసియిచ్చిన సన్నజాజి పువ్వులను సమాధిపై ఉంచి బరువెక్కిన హృదయాలతో ఇంటికి బయలుదేరారు.

తరువాత రెండురోజులు సరదాగా కాలక్షేపం అయింది. కాని అందరి లోకీ చలాకీగా ఉండే అనీల తెచ్చి పెట్టుకొన్న ఉత్సాహంతో ఉన్నట్లు అంతగా గమనించలేకపోయినా అనీల డల్ ఐపోయినట్లు అంతా భావించారు.

మూడవనాడు అనీల తనకు బాగుండ లేదని ప్రయాణం కట్టింది. ఎవరెంత బ్రతిమిలాడినా ససేమిరా అని భీష్మించి కూర్చుంది. దాంతో పదిరోజులు ఉందామ నుకున్న ఫ్రెండ్సు అందరూ మూడవనాడే ప్రయాణం కట్టారు. ఇది రూపకి తల్లి దండ్రులకి బాధ కలిగించినా ఏమీ చేయ లేకపోయారు.

ఇంకా 15 రో. సెలవులు వుండటం వలన రూప వారితో కలసి వెళ్ళకుండా ఆగిపోయింది. వారిని ముక్కేశ్వరం కారులో తీసుకొని వెళ్ళి పడవ ఎక్కించి వెనుతిరిగింది. అనీల వింత ప్రవర్తనను గురించి ఆలోచిస్తూ నెమ్మదిగా డ్రైవ్ చేస్తూ ఇంటికి చేరింది.

ఆ రోజు శుక్రవారం మద్రాసు నుండి ఉత్తరం రావటంతోనే భాను రాసి ఉంటుందని, ఫ్రమ్ ఎడ్రసు చూడగా, అది అనీల వ్రాసినట్లుగా ఉంది. ఏమి వ్రాసింది చెప్మా అని ఆసక్తిగా ఉత్తరం చింపి చదవటం ఆరంభించింది.

"ప్రియమైన రూపకి,

మేమంతా మద్రాసు క్షేమంగా చేరి నట్లు భాను వ్రాసే వుంటుంది. అమలా పురంలోని నా వింతప్రవర్తన నీ కాశ్చ ర్యాన్ని కలిగించవచ్చు. కాని నేను ఒక దిద్దుకోలేని పొరపాటు చేసాను. మీ వేంక టేశ్వరి మరణానికి పరోక్షంగా నేనే కారణమని నీవు చెప్పినదాన్ని బట్టి గ్రహించిన నేను, ఆపరిసరాలలో మసలి నన్నిరోజులు 'వేంకటేశ్వరి నామరణానికి నీవే కారణం; యీ యింటి దుఃఖానికి నీ తెలివితక్కువ సలహాయే మూలమ'ని ఎత్తి చెపుతున్నట్లు ఫీలయిన నేను, ఆ యింటిలో ఉండలేకపోయినాను.

బహుశా నీకు నా మాటలర్థం కావటం లేదనుకుంటాను సరే. నీ కర్థ మయేలాగ వ్రాస్తాను. అంతా చదివి నన్ను అసహ్యంతో శపిస్తావో లేక జాలితో క్షమిస్తావో నీ యిష్టం.

నీవు చెప్పిన డా॥ శ్రీరామ్ నాకు అన్నయ్య అవుతాడు. ఒక తల్లి కడుపున పుట్టకపోయినా మా మధ్య ఎటువంటి అరమరికలు ఉండేవికావు. నీ కంటె సీనియర్ జెన్ రికికో శలవు లకు అన్నయ్య యిక్కడకు వచ్చినపుడు చూసి ఆకర్షితురాలయింది. జెన్ రికికో తండ్రి ఢిల్లీలో అమెరికా అంబాసిడర్‌గా

ఉన్నారు. ఇండియా గురించి విని మన దేశంలో చదువుకోవాలనే ఆసక్తితో మద్రాసులో మెడికల్ కాలేజీలో చేరింది. అన్నయ్య ఆమెను వివాహం చేసుకొంటే, ఎప్పుడూ గొప్ప పదవులలో వుండాలని కలలు కనే అన్నయ్యకు, ఫారిన్ స్టడీస్ వస్తాయని, గొప్పస్థాయికి చేరగలడని నేను భావించే దానిని.

మీ బాబయ్యగారు ఉత్తరం వ్రాసినపుడు కాబోలు నా సలహా కోరుతూ అన్నయ్య ఏం చెయ్యమంటావని వ్రాసాడు. అందులో ఆయన వ్రాసిన అమ్మాయిని చేసుకోడానికి తనకు ప్రత్యేకంగా ఏమీ అభ్యంతరాలు లేవని వ్రాసాడు. కాని పెద్ద భవిష్యత్తు ఊహించుకొన్న నాకు యిది అశనిపాతంలా తోచింది. వెంటనే చాలా ఘాటుగా మిస్ రికికో గురించి వ్రాశాను. ఆమెను చేసుకుంటే అతనికి గల ఉజ్వల భవిష్యత్తును ఊరిస్తూ వ్రాసాను. నా ఉత్తరం పర్యవసానమే వేంకటేశ్వరి మరణం అని అప్పటికి నేను ఊహించలేకపోయాను. ఇప్పుడు గ్రహించి నరకయాతన పడుతున్నానంటే నీవు నమ్మవేమో.

నా ఈ తొందరపాటు సలహా ఒక నిండు ప్రాణాన్ని బలి తీసుకొన్నదని తెలిసిన తర్వాత నా మనసు నాకే ఎదురు తిరుగుతున్నది. అన్నయ్య, వదిన రికికోతో యిప్పుడు వాషింగ్టన్ లో వున్నాడు.

నిన్ను క్షమించమని కోరే అర్హత కూడా లేని నీ స్నేహితురాలు

—అనీల"

ఉత్తరం చదివిన వెంటనే రూప కన్నులనుండి ఆమెకు తెలియకుండానే కన్నీరు కారజొచ్చింది. అనీల ప్రవర్తనకు కారణ మిచన్నమాట అనుకొన్న రూప అనీలను గూర్చి చెడుగా ఆలోచించ లేకపోయింది. తనవారి బాగును చూసుకొన్నదేకాని దానివలన ఇతరుల కష్టాలనుగూర్చి యోచింపలేని అమాయకురాలినిగా తలచి నిట్టూర్చింది. వెంటనే 'యిందులో నీ తప్పు ఏముంది. అంతా దైవ నిర్ణయం. నీవు బాధపడవద్దు' అని అనీలకు ఉత్తరం వ్రాసింది. కాలేజీలు తెరిచారు.

రూప మద్రాసు వెళ్ళింది. అనీలతో యథాప్రకారంగానే ఏమీ జరగనట్టే ప్రవర్తించసాగింది ఫైనల్ యియర్ పరీక్షలు వ్రాసినతరువాత బీచిలో కూర్చుని ఏమేం చేయాలని మాట్లాడుకున్నారు. భాను, సుజాత బుద్ధిగా పెళ్ళి చేసుకుని ప్రైవేట్ నర్సింగ్ హోమ్స్ పెడతామన్నారు. రాధ గవర్నమెంటు డాక్టరుగా వెడతానన్నది. జానకీ, దేవీ మిలటరీలోకి వెళ్లాలని ఉన్నదన్నారు. అనీల మాత్రం తనకేమీ ప్రస్తుతం ఊహ లేదని వాళ్ళన్నయ్య రెండు నెలల్లో వస్తాడని, వచ్చేక నిర్ణయించుకొంటానన్నది. రూప భవిష్యత్తు ముందుగానే నిర్ణయింప



బడింది — ప్రసాదన్నయ్య సలహా మీద రూప నాన్నగారి నర్సింగ్ హోమ్ నడపటానికి. 6 సం॥లు కలసి చదువుకొన్నవారు విడిపోయేటప్పుడు చాలా బాధపడ్డారు. ఆమెను సాగనంపటానికి ఆమె ఫ్రెండ్సు అంతా స్టేషనుకు వచ్చారు. అంతా ఆప్యాయంగా ఏపిల్స్, పూల గుత్తులు, రూపకు యిచ్చారు. వారినివిడిచి తాను వెళ్ళగలనా అనిపించింది. ఆడుతూ పాడుతూ తిరిగే విద్యార్థిదశ విడిచి కష్టసుఖాలుగల నిజ జీవితంలోకి అడుగు పెట్టబోతున్న రూపకు అదే పరిస్థితులను ఎదుర్కోబోతున్న వారంతా బరువైన హృదయాలతో వీడ్కోలు చెప్పారు.

కనిపించినంత దూరం రుమాలు ఎగర వేసి, తరువాత సావధానంగా కంపార్టు మెంటులో కూర్చుంది. కూర్చున్న తర్వాత పెట్టెలో ఎవరున్నారా అని పరిశీలనగా చూస్తున్న రూప కంటికి ఎదురుగా కూర్చున్న యువకుడు కన్పిం చాడు. కొంచెం సేపటికి అతని చేతి లోని 'సైన్సు టుడే' కరెంటు జర్నల్ ఆకర్షించింది. వెంటనే "చూసి ఇస్తాను ఒకసారి ఇవ్వండి" అని ఇంగ్లీషులో అడిగింది. అతను చిరునవ్వుతో ఇచ్చాడు. ఆసక్తిగా కొన్ని టాపిక్స్ చదివి తిరిగి ఇచ్చేస్తూ మర్యాదకి "మీ పేరేమిట"ని అడిగింది. ప్రభాకర్ అని చెప్పాడు. అతను ఉత్సాహంతో మీ పేరు రూప కదండీ, డాక్టరు కోర్సు పూర్తయి నట్లుంది అంటూంటే ఆశ్చర్యంగా ఎలా తెలిసిందా అన్నట్లు ముఖం పెట్టింది. అది గమనించి అతను పైనవున్న లెదర్ సూట్‌కేస్‌ను వేలుపెట్టి చూపించాడు.

దాని మీద తన పేరు యియర్ క్లియర్‌గా ఉన్నాయి. వారిమధ్య సంభా షణ ఇంగ్లీషులోనే నడిచింది. ప్రభాకర్ కూడ డాక్టరని మాటల సందర్భంలో తెలిసింది. చాల ఉత్సాహవంతుడైన ఈ డాక్టరు స్నేహపాత్రుడని భావించింది. రాజమండ్రిలో స్టేషనుకు వచ్చిన ప్రసాదన్నయ్యను చూసి 'యిటు, యిటు అన్నయ్యా!' అని రూప బిగ్గరగా కేక వేసింది. అన్నయ్యను చూసిన రూపకు సంతోషం ఆగలేదు. డాక్టర్ ప్రభాకర్‌ని చూపించి పరిచయం చేసేలోగా నే, "ఏరా నీవూ ఈ ట్రైన్‌కే వచ్చావా" అని ప్రసాదన్నయ్య, ప్రభాకర్‌ని గట్టిగా కౌగలించుకున్నాడు. వీళ్ళిద్దరికీ ఎలా తెలుసునబ్బా అని రూప ఆలోచిస్తూ బుగ్గన వేలు పెట్టుకొని అలాగే నిలబడి పోయింది.

"వీడు నాక్లాస్‌మేట్ ఇంటర్ వరకూ. నేను గుంటూరులోను, వీడు ఉస్మానియా లోను ఎం.బి. చదవటం వలన విడి పోయాం మేము ప్రాణ స్నేహితులమ"ని చెబుతూంటే రూప అలాగే నిలబడి పోయింది. వెంటనే రూపకు, అన్నయ్య, 'ప్రభూ నేనూ ఇలా చేసాము అలా తిరిగాము' అని చెప్పటం గుర్తువచ్చి ఆ ప్రభూయేనా ఈ ప్రభాకరం అని చిన్నగా నవ్వుకొంటున్నది.

"రూపగారు తనలో తానే ఎందుకో నవ్వుకొంటున్నారు. మాకు చెబితే మేమూ నవ్వుతాంగా" అన్న ప్రభాకర్ మాట లతో ఈ లోకంలోకి వచ్చిన రూప చిరునవ్వుతో సమాధానం చెప్పకుండా కాపువై పుకు నడిచింది. రాజమండ్రి నుండి ఏదో పల్లెటూరికి వెళ్ళాలనుకొన్న ప్రభా కర్ అన్నయ్య బలవంతంమీద వాళ్ళ ఊరు రావటానికి అంగీకరించాడు. ధవ ళేశ్వరం ఆనకట్ట మీదుగా అమలాపురం వచ్చారు. వాళ్లు యింటికి వచ్చేటప్పటికి




హాలులో ఎదురు చూస్తున్న అమ్మా, నాన్నగార్లు గబగబా పోర్టికోలోకి వచ్చారు.

వారితో దిగిన ప్రభాకర్‌ను అన్నయ్య, అమ్మా నాన్నగార్లకు పరిచయం చేశాడు. రెండు రోజులు సరదాగా గడిపి డాక్టరు వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిపోయిన సాయంత్రం అన్నయ్య అమ్మ దగ్గర రూప వివాహ విషయం కదిపి ప్రభాకర్‌కిచ్చిచేస్తే బాగుంటుందని సూచించాడు. అమ్మ నాన్నగారితో మాట్లాడి ప్రభాకర్ తల్లిదండ్రులకు వ్రాయమని, మన ఇంటికి డాక్టర్ల సంబంధాలు అచ్చిరావేమోనన్న సందేహం వెలిబుచ్చింది. కాని అన్నయ్య అలా జరగదని తానే స్వయంగా ప్రభుకి ఉత్తరం వ్రాశాడు. అతనువెంటనే సంతోషంతో తన అంగీకారం తెల్పుతూ యిలా వ్రాశాడు:

ప్రభాకర్ తల్లిదండ్రులు చిన్నప్పుడే పోవడంచేత మేనమామ సంరక్షణలో పెరిగాడట. ఆప్యాయతను కరువుచేసి దూరమైన తల్లిదండ్రులు పుష్కలంగా ఆస్తిని విడిచిపెట్టి వెళ్ళడంచేత మేనమామ బాగానే చూసేవాడని, తల్లి ఆనతి ప్రకారం తన వివాహం తిరుపతి కొండపై జరగాలని వ్రాసాడు.

ఆ విధంగానే దైవ సన్నిధిలో నిరాడంబరంగా వారి వివాహం జరిగిపోయింది. తిరిగివచ్చిన తరువాత కాలవ

ఒడ్డునగల పెద్ద తోటలో ఒక నర్సింగ్ హోమ్ కట్టడానికి నిశ్చయించారు. దానికి వేంకటేశ్వరి పేరు పెట్టాలని రూప సజెస్టు చేసింది. అంతకుపూర్వమే ఆమె ద్వారా కథ అంతా విన్న ప్రభాకర్ దానికి సంతోషంతో అనుమతించాడు. నాన్నగారి ప్రాక్టీసుతో అన్నయ్యకు, నర్సింగ్ హోమ్‌తో రూపకి, ప్రభాకర్‌కి ఎక్కడా తీరికనేదే లేకుండాపోయింది. గిర్రున 5 సం॥ తిరిగిపోయాయి. రెండు నెలలు హాస్పిటల్‌ను అసిస్టెంట్ డాక్టరును చూసుకొమ్మని రూప, ప్రభాకర్, ప్రసాద్‌లు దేశ యాత్రకు బయలు దేశారు.

అనుకోకుండా బొంబాయిలో అనీల కనిపించింది. మనిషిలో మునపటి చలాకీతనం లోపించినట్లుగా ఉంది. వెంట 5 సం॥ పాప వున్నది. పెళ్ళికి పిలిచేవుకాదేమని అన్న రూప ప్రశ్నకు ఆమె నవ్వుతూ, "నేను చేసుకుంటే తప్పక పిలుస్తాను" అన్నది. మరి ఐతే అని ఆ పాపవంక చూసింది రూప. అది గ్రహించి అనీల "మా అన్నయ్య పాప" అని చెప్పి ఇంటికి బలవంతంగా తీసుకెళ్ళింది. ఇల్లు చాలా నీటుగా అందంగా వున్నది. కానీ వాళ్ళన్నయ్య, వదిన కనిపించలేదు.

"మీ వదినను మాకు చూపించవా?" అని నవ్వుతూ అడిగింది రూప.

అనీల అదో విధంగా నవ్వుతూ, "మీ వేంకటేశ్వరికి చేసిన అన్యాయానికి ఫలితమా అన్నట్లు వదిన పాపను ప్రసవించి వాషింగ్టన్‌లో మరణించింది. శ్రీరామ్ అన్నయ్య పాపను తీసుకుని ఇండియాకు వచ్చాడు. అప్పుడు నీవు అడిగావు గుర్తుందా? ఎం. బి. అయినాక ఏం చేస్తావని. అన్నయ్య వచ్చేవరకు ఏమీ నిర్ణయించుకోలేదని అన్నానుకదా. అదే విధంగా పాపతో ఒంటరిగా వచ్చిన అన్నయ్యను చూస్తే నాకు ఏదో కర్తవ్యం ఉన్నట్లు తోచింది. అన్నయ్య పాపను నా వద్ద ఉంచి మనశ్శాంతికై ప్రపంచ పర్యటన చేస్తానని వెళ్ళిపోయాడు. వేంకటేశ్వరికి అన్యాయం చేయటం వలననే అన్నయ్య జీవితం బుగ్గిపాలయింది. ఈ చిన్నిపాపకు వేంకటేశ్వరని పేరు పెట్టి నేనే పెంచి పెద్ద చేయాలని, ఇక వివాహ విషయం తలపెట్టరాదని అనుకొన్నాను. వివాహమైతే వచ్చే వరుడు పప్పీ (వేంకటేశ్వరి) నాతో ఉండటానికి అభ్యంతరం పెట్టవచ్చు" అని ముగించింది.

అంతా విన్న రూప నిశ్చేష్టురాలైంది. "మీ పరిస్థితి తెలిసి మిమ్మల్ని వివాహమాడటానికి ఎవరైనా ముందుకు వస్తే" అని అన్నయ్య అన్నదానికి, "అది సాధ్యంకాదు. అటువంటి కోరిక నాకు లేద"ని నిష్కర్షగా అనీల అంది.

ఉద్రేకంతో ప్రసాద్ "నేనే మిమ్మల్ని వివాహం చేసుకుంటానంటూంటే...."

ఆశ్చర్యపోవడం రూప వంతు ఐంది. వేంకటేశ్వరి అంటే ప్రసాద్ అన్నయ్యకు ఎంత ప్రేమో తాను ఎరగనిది కాదు. అటువంటిది తన చెల్లెలు మరణానికి కారణమైన యువతిని, తన వేంకటేశ్వరిని తిరస్కరించినవాని కూతుర్ని స్వీకరించడానికి సిద్ధపడుతున్నాడంటే కలా, నిజమా అని రూప గిల్లి చూసుకొన్నది. అనీల అంగీకారంతో అన్నయ్య రిజిష్టర్ మ్యారేజి చేసుకొన్నాడు. రూప ప్రభాకర్ సాక్షి సంతకాలు చేసారు. రూపకు ఇంకా అన్నయ్య చర్య అర్థం కాలేదు. అనీల గదిలోపల ఉండగా ఇదేమి పని అని అడిగింది.

దానికి అన్నయ్య నవ్వుతూ, "నీకు అర్థంకాని దేముంది చెల్లాయ్ ఇందులో. నా చెల్లెలుగా నా భవిష్యత్తును నీ వెలాగైతే కాంక్షిస్తావో అదే విధంగా అనీల కూడా తన అన్న శ్రీరామ్ ఉజ్జ్వల భవిష్యత్తునుగూర్చి కలలు కన్నది. తాను చేసిన పొరపాటు గ్రహించి పశ్చాత్తాప పడిందనటానికి ఆమె జీవితంపై తీసుకొన్న నిర్ణయమే తార్కాణం. చేసిన పొరపాటు గ్రహించి, మన వేంకటేశ్వరిపై అంత అభిమానం, గౌరవం పెంచుకొన్న యువతి మన ఇంటికి కోడలుగా రావటం నీకు మాత్రం ఇష్టం కాదా? నీవు చూసావో లేదో 'పప్పీ'లో వేంకటేశ్వరి పోలికలు చాలా కన్పిస్తాయి పరీక్షగా చూస్తే. వేంకటేశ్వరి యీ విధంగా జన్మించిందో ఏమో మళ్ళా. ఆ విధంగానైనా మన నట్టింట వేంకటేశ్వరి ప్రతిరూపం వంటిదైన 'పప్పీ' తిరగటం ఆనందదాయకంకాదా" అని అన్నాడు. అన్నయ్య సహృదయానికి మనస్సులో జోహారు లర్పించింది రూప.

అంతా ప్రయాణాన్ని మధ్యలో ఆపుకుని తిరుపతి వెళ్ళి దైవ దర్శనం చేసుకొని ఇంటికివచ్చారు. ఎప్పుడూకూడ వారివిషయాలలో జోక్యం కలిగించుకోని అమ్మా నాన్నగార్లు అన్నయ్య చెప్పకుండా పెళ్ళి చేసుకున్నందుకు అంతగా బాధ పడలేదు. నాన్నగారు ఊళ్లో వాళ్లకి పెద్ద డిన్నరు ఏర్పాటు చేశారు. వదినను చూసి అంతా మహాలక్ష్మిలా ఉన్నదని పొగడి వెళ్ళిపోయారు.

వేంకటేశ్వరి నర్సింగ్ హోమ్‌ను నాన్నగారి హాస్పిటల్‌ను కలిపివేసి, ప్రసూతి గృహం వగైరా కట్టించారు. నిత్యం "వేంకటేశ్వరి నర్సింగ్ హోమ్" సందడిగా ఉంటుంది బాగుపడ్డ ప్రతీరోగికూడా ముందు హాల్లో ఉన్న వేంకటేశ్వరి నిలువుటెత్తు పటానికి నమస్కరించకుండా వెళ్ళలేరు. అనీల లేవగానే వేంకటేశ్వరి చిత్రపటానికి నమస్కరించి దైనందిన కార్యక్రమాలలో ప్రవేశిస్తుంది. ఆ విధంగా కలకల లాడుతున్న ఇంటిని, నర్సింగ్ హోమ్‌ను చూసి ఏ లోకంలోనో ఉన్న వేంకటేశ్వరి సంతృప్తి పడుతుంది.


మర్యాదస్తులుగా బ్రతికితే ఇదో చిక్కు - మన హక్కుల్ని దౌర్జన్యంగా సాధించుకొనే అవకాశం ఉండదు!
అసలు దుర్మార్గులంటేనే దేవుడికి ఎక్కువ ఇష్టం అనుకుంటాను - వాళ్ళనే ఎక్కువమందిని సృష్టించాడు!!


వాళ్ళే నయం - హాయిగా జీవిస్తారు! కాస్తో కూస్తో మంచితనం ఉంటే చిక్కులు తప్పవు!!
పైగా, మంచివాళ్ళు త్వరగా ఛస్తారు - అలా బ్రతకడం కష్టం కనుక!!
Anjan




(గత సంచిక తరువాయి)

**ఆ** సుందర సంధ్యలో సముద్రతీరాన కవిత్వాలూ, విశేషణాలూ, నటనలూ లేకుండా అతి సాధారణంగా తన అభిప్రాయాన్ని వెలిబుచ్చింది రమ.

"ఈరోజు ఆఫీసులో మీరు విపరీతంగా బాధపడటం చూశాను రామారావుగారూ. స్నేహంమీద సాహసించి అడుగుతున్నాను; గతించిన ఆమె గురించి బాధ వుండకపోదు. కాని ఆలోటును భర్తీ చేసుకోకూడదా మళ్ళీ?"

వింటూనే విపరీతమైన బాధను వ్యక్తీకరించాయి రామారావు ముఖ కవళికలు. "నీకు తెలియదు రమా. నేనూ, నా భార్యా ఎంత అన్యోన్యంగా వుండేవాళ్ళమనీ? ఆమెవంటి సుశీలను అన్యాయం చేయడంకాదా మళ్ళీ వివాహం చేసుకోవటమంటే?... ఈ రోజు మా పెళ్ళి జరిగినరోజు. ఎన్నెన్ని జ్ఞాపకాలతో నా మనస్సు ఏమవుతోందో యివాళ'' అంటూనే ముఖం మరో వైపుకు తిప్పుకున్నాడు.

సున్నిత హృదయిని అయిన రమకుకూడా దుఃఖం కలిగింది. కనులు ఒత్తుకుంటూ అన్నది: "భార్యను, అందునా అతి ఉత్తమురాలిని మరచిపోవడం దుర్లభమే. మరచిపోవడం కృతఘ్నతకూడా. కాని... చిన్న చిన్న పిల్లలతో వున్న మీ వంటి వారికి ఈ పృథ్విపై మనుగడకై మరో మనువు అత్యవసరం!"

"రమా!"

''అవును రామారావుగారూ. నాకుగల జ్ఞానం మేరకు నేను చెప్తున్నాను. మీ ముందుపత్నిని ద్వేషించి ద్వేషింపజేసి, ఆ పసిబిడ్డలను బాధించే స్త్రీని తెచ్చు

కుంటే అది ఆమెగారికి అన్యాయం చేసినట్లౌతుంది కాని, పిల్లలకు కరవైన మాతృత్వప్రేమను అందించి పెంచి, మీరు పోగొట్టుకున్న సంసార సుఖాన్ని తిరిగి పూరించి, అమరలోక వాసినియైన ఆమెను పూజించే యువతిని వివాహమాడటం మాత్రం అన్యాయం కాదనే నా నమ్మిక. ఉత్తమురాలైన స్త్రీ ఏ లోకంలోవున్నా తనభర్త సౌఖ్యమూ, పిల్లల సంతోషమే కోరుకుంటుంది."

నిరాశగా అన్నాడు రామారావు. "అటువంటి యువతి దొరికే అదృష్టం నా సుఖా వుంటుందా రమా? ఆ మాత్రం అదృష్టమేవుంటే నా భార్య పోయేదేకాదు."

రమ సూటిగా చూసింది అతడి కళ్ళలోకి. "అదృష్టం ఎందుకులేదు రామారావుగారూ! మీకు అంగీకారమైతే నన్ను వివాహం చేసుకోండి. నా అంత నేను అడుగుతున్నానని చులకనగా మాత్రం భావించవద్దు" అంటూ తల వంచుకుంది.

"ఎంతమాటన్నావ్ రమా?" నొచ్చుకున్నాడు రామారావు. "కాని అంత త్వరపడి నిర్ణయాలు చేసుకోవటం మంచిదికాదు. నా పై జాలితో నీ జీవితాన్ని పణంగా ఒడ్డుతావా? తప్పు. తొందర పడకు. బంగారంవంటి నీ భవిష్యత్తును బలితీసుకునేంత స్వార్థం లేదు నాలో."

"ఇందులో నా స్వలాభం లేదనను కాని అది కేవలం స్వార్థం మాత్రంకాదు. బీద కుటుంబాలలోపుట్టి అవసరార్థం ఉద్యోగాలు చేస్తూన్నప్పటికీ, సరైన వివాహం చేసుకుని, చక్కటి గృహిణిస్థానం పొందాలనే ఆశ నావంటి యువతులకు వుండడం అత్యాశ కాదనే అనుకుంటాను."

"ఛఛ. నేనలా భావించలేదు రమా, కాని..."

"ఏమిటి కాని?" మధ్యలోనే అందుకున్నది రమ. "స్వర్గీయురాలైన ఆమెను ద్వేషించే మూర్ఖత్వం కాని, తల్లిని కోల్పోయిన ఆ పసివాళ్ళను హింసించే రాక్షసత్వంగానీ నాలోలేదు. నమ్మగలిగితే నమ్మండి. అదేగా మీ అనుమానం?"

"అబ్బబ్బ కాదు రమా. నీ మంచితనంపై నాకు పూర్తి నమ్మకం వుంది. కాని నన్ను పూర్తిగా మాట్లాడనీ."

"ఏమిటో చెప్పండి."

"నీకూ నాకూ వయోవ్యత్యాసం పదహారు పదిహేడేళ్ళయినా వుంటుంది. ఇప్పుడిప్పుడే యౌవన ప్రాంగణంలో అడుగెట్టిన నువ్వు ఎందుకీ నలభయ్యోపడిలోపడుతూన్న వాడిని కోరుకుంటావ్? చక్కటి యువకుడిని వివాహమాడి ఆనందమైన సంసారం సాగించు రమా."




నిర్వేద మొలికే నవ్వు నవ్వింది రమ. "మీరు ఒకమాదిరి ధనవంతులు. అంచేత మాబోటివారి కష్టాలు అంతగా తెలియవు. చెప్తున్నాను వినండి. చదువులకూ, చక్కటి జీవితాలకూ భర్తలకూ నోచుకోని బీద బ్రతుకులు మావి. మా పెద్దక్కను ఓ బీదముసలి వాడికీ, రెండో అక్కను రోగిష్టి ముదుసలికీయిచ్చి వదిలించుకున్న నా తలిదండ్రులు యిక నా వివాహం మాటా, భవిష్యత్తుమాటా మరచేపోయారని చెప్పడానికి సిగ్గుపడ్తున్నాను. మా వంటివాళ్ళు తెలివిగా తమభవిష్యత్తును తామే ఏర్పరచుకోవాలి కాని తలిదండ్రులూ - తోబుట్టువుల అండలు అంతగా వుండవు మాకు. యావజ్జీవితం యిలాగే వుండిపోవాలని లేదు నాకు. నన్ను ఆదరించే భర్త, నా కోక విలువను ఆపాదించే సంసారమూ, గృహిణీత్వమూ కావాలని నా ఆశ. ఇలా మీ ముందు మాట్లాడటానికి నా కెందుకో సిగ్గుగా లేదు."

"సిగ్గు పడవద్దు, చెప్పు రమా స్పష్టంగా." భరోసాగా మాట్లాడాడు జాలిగా వింటూన్న రామారావు.

"ఎవరో తెలియని వ్యక్తిని వివాహమాడటంకంటె తెలిసిన అనురాగమూర్తిని వివాహమాడి జీవితం సుఖమయం చేసుకోవాలని నా కోరిక. మనసులు ఒకటైన చోట, వయసు ఆలోచనకు స్థానముండదు."

రామారావు మాట్లాడకుండా ఇసుకలో గీతలు గీయసాగాడు.

రమ అన్నది నెమ్మదిగా: "ఒక వేళ మీకు యింతకుముందే ఏమైనా సంబంధాలు వచ్చివుంటే మాత్రం నా కోసం మొఖమాట పడవద్దు, చెప్పేసేయండి. నా విషయం మరచిపోండి. మనమధ్య స్నేహంమాత్రం మామూలుగా వుండనీయండి."

ఒకసారి తలెత్తి ఆమెను చూసి మళ్ళీ వాల్చేసుకున్నాడు రామారావు ఏమీ సమాధాన మీయకుండా.

"ఏదో చెప్పబోయి సందేహిస్తున్నారు. మీ కే మాత్రం అభ్యంతరం వున్నా వద్దులెండి ... ధనవంతులవటాన మీలో కట్నాలు కూడా వుంటాయి. కాని మా స్థితి చెప్పాను కదా?"

ఉలికిపాటుతో తలెత్తి చూశాడు రామారావు. "నే నటువంటివాడినా? ఎలా ఆలోచించావు రమా ఇంత స్నేహంమీద అలాగ?"

రమ మాట్లాడలేదు.

చాలాసేపు ఎవరి నించీ ఎటువంటి సంభాషణా రాలేదు.

"చూడు రమా." చాలాసేపటికి అన్నాడు రామారావు. "బాధకలిగే విషయాలైనా స్పష్టంగా మాట్లాడుకోవటం మంచిది ... నేను ముగ్గురు బిడ్డలతండ్రిని. నీవా కన్యవు. బాదరబందీలేని యువకుడిని చేసుకున్న సౌఖ్యం మాత్రం నీకు నాతో ఏ విధంగానూ కలగదని నా అభిప్రాయం."

"అదంతా నే నాలోచించాను. సంతృప్తి వున్న సంసారంలో సంతోషానికి కొదువవుండదు." స్థిరంగా అన్నది.

"సరే, ముఖ్యమైన సంగతి విను... నాకు... నాకు యిక పిల్లలు పుట్టరు!"

ఉరుములేని ఆ పిడుగుపాటుకు రమలోని స్త్రీత్వం తృళ్ళిపడింది. ఆమె వెంటనే ఏమీ మాట్లాడలేకపోయింది. చాలాసేపు ఆలోచించుకున్న తర్వాత ప్రకాశంగా అన్నది చిరునగవుతో: "ఫర్వాలేదు. అదొక పెద్దలోపం కాదు."

"రమా! ఏం మాట్లాడుతున్నావు?" ఆశ్చర్యంగా అడిగాడు రామారావు.

నవ్వింది రమ. "ఫర్వాలేదు. బాగా యోచించే మాట్లాడుతున్నాను. నిజమే, సంతానవాంఛలేని స్త్రీ వుండదు. కాని ... మీరు క్రమంగా వుండీ నాకు సంతానయోగం లేకుంటే అప్పుడేం చేసేదాన్ని? ఎందరో దంపతులు సంతాన హీనత్వంతో బాధపడటం మనం చూడడంలేదా? నేనూ అలాంటి వంధ్యురాలినే కావచ్చుకదా? ... అయినా మీ భార్యనైన తర్వాత మీ

ముగ్గురు బిడ్డలూ నా బిడ్డలే ఔతారుకదా? ఇక నా సంతానం, మీ సంతానం అనే తేడావుంటే మన వివాహానికి అర్థమే వుండదు! మాతృత్వం పొందడానికి ప్రకృతి సహజంగా స్త్రీ అనుభవించవలసిన కష్ట మేమీ అనుభవించకుండానే ముత్యాలవంటి ముగ్గురు బిడ్డలచే నన్ను 'అమ్మా' అని పిలిపించుకోగలగడం నా అదృష్టం!"

"ధన్యుడిని రమా!" ఆనంద సాగరంలో మునకలు వేస్తున్న రామారావు అంతకంటె మాట్లాడలేకపోయాడు.

* * * *

తమ పరిణయగాథను సుభద్రకు వినిపించుతూన్న రమ చెప్పటం ముగించుతూ అన్నది: "నిజంగా మా వైవాహిక జీవితం చాలా ఆనందంగా గడచిపోతోంది ఎటువంటి పొరపొచ్చాలూ మా మధ్యనలేవు. కన్నతలిదండ్రులుకూడా యివ్వని ప్రేమాదరణలు భర్తగా ఆయన నాకిస్తున్నారు. ఇంతటి ఉత్తముడైన భర్తనూ, చక్కటి బిడ్డలనూ, గృహాన్ని ఐశ్వర్యంతోపాటు నాకు దానం చేసి వెళ్ళిపోయిన ఆమెను నే నెప్పుడూ దేవతగానే కొలిచి ఆరాధిస్తాను. నా ఈ జీవితం ఆ పుణ్యవతి ప్రసాదంగానే భావిస్తాను... ఈ బిడ్డలు నావాళ్ళు కాదన్న తలపే నాకు సాధారణంగా కలగదు ఎవరైనా గుర్తుచేసేవరకూ. ఆమె భర్తను నేను పొంది, ఆమె గృహిణీ స్థానాన్ని నేను ఆక్రమించి, ఆమె యింటినీ సంసారాన్నీ స్వంతం చేసుకొన్నప్పుడు ఇక ఆమె బిడ్డలు మాత్రం నా బిడ్డలు కాకే మౌతారు? ఆమె నా పాలిటిదైవం కాక ఏ మౌతుంది?"

ఇంటికిజేరిన తర్వాతకూడా సుభద్రకు రమ మాటలే చెవులలో వినిపించ సాగాయి.

"అలాగున్నావేం సుభద్రా? ఒంట్లో బాగుందా?" అని చలపతి రెండు మూడుసార్లు అడిగి సరైన సమాధానం పొందలేక పోయాడు.

ఎవ్వర్నీ తిట్టుకోకుండా, విసుక్కోకుండా సుభద్ర మౌనంగా వుండడ మనేది చలపతి చూడడం అదే ప్రథమం.

# 11

సుభద్ర ఆ యింట అడుగుపెట్టిన తర్వాత ఎన్నడూలేనిది ఆ రోజునమాత్రం జరిగింది. ఆ విశేష మేమంటే సుభద్ర వేకువనే చలపతి లేవకముందే లేచి కాలకృత్యాలు తీర్చుకోవడంలో నిమగ్నురాలై వుండడం.

చలపతి వింతగా చూశాడామె కేసి. "సుభద్రా. అప్పుడే లేచావేమిటి? నిద్రపట్టలేదా బాగా?" అన్నాడు ఆమె సమీపంగా వెళ్ళి.

"అదేం లేదు. బాగానే నిద్రపోయాను" అన్నది నెమ్మదిగా.

అంతలో పిల్లలుకూడా లేచిరావడంతో సంభాషణ ఆపేశాడు చలపతి.

"త్వరగా ముఖాలు కడుక్కుని రండి." సుగుణా జానకిలను హెచ్చరించి తాను బ్రష్ తీసుకుని బాత్‌రూమ్‌కు వెళ్ళాడు చలపతి. స్నానాదికాలు ముగించి అరగంటలో అతడు తిరిగి వచ్చేసరికి సుభద్ర వంటింట్లో కాఫీ తయారుచేసి కప్పులలో నింపి టేబుల్‌పై అమర్చుతూన్నది. వర్ణింపరానంతగా విస్మయం చెందిన చలపతి ఏమి మాట్లాడాలో తెలియక మౌనం వహించాడు. లోకం తెలియని సుగుణా జానకిల కండ్లలోకూడ ఆశ్చర్యం దోబూచులాడింది.

కాఫీతాగుతూ "నువ్వు తీసుకున్నావా సుభద్రా?" అనడిగాడు చలపతి మార్దవంగా.

"ఇదిగో, నేనూ తీసుకుంటున్నాను" అంటూ వారితో తానూ తీసుకుంది. అంతలో అప్పుడే లేచిన రవిని ఎత్తుకుని అటుగా వచ్చిన నరసమ్మకు మౌనంగా ఒకగ్లాసుతో కాఫీ అందించింది సుభద్ర. ఈ హఠాత్పరిణామ మేమిటో అర్థం కాని నరసమ్మ బెదురు చూపులు చూసింది.

స్నానాలు చేసి వచ్చిన పిల్లలకు చలపతి తలలు దువ్వాడానికుపక్రమించాడు. అతడు జానకికి తల దువ్వి క్లిప్పులు పెడ్తూవుండగా సుభద్రవచ్చి మరో దువ్వెన తీసుకుని సుగుణకు తలదువ్వి జడలు వేయడాని కుపక్రమించింది.

"నీకు జడవేయటం వచ్చా పిన్నీ?" ఏం మాట్లాడాలో ఏం మాట్లాడకూడదో తెలియని జానకి సిసింద్రీలా అడిగింది.

నవ్వి వూరుకుంది సుభద్ర.

సుగుణ బిత్తర చూపులు చూసింది.

చలపతికి ఏం మాట్లాడాలో,. ఎలా ప్రవర్తించాలో తెలియని అయోమయ పరిస్థితి అయిపోయింది. సుగుణకు జడలువేసి రిబ్బనులు కడుతూన్న సుభద్ర ముఖంవైపు పరీక్షగాచూశాడు. ఎందుకో ఆ వదనం రోజూవుండే కళాకాంతులు కోల్పోయింది. ఎప్పుడూ ఆమె వదనాన్ని ఆవరించివుండే అసహనం, క్రోధం నేడు లోపించి ఒకవిధమైన నిర్లిప్తత అలముకుని వున్నది. ఆమె ఆ పనులన్నీ పూర్తియిష్టంతో చేస్తూన్నదో లేదో గ్రహించ శక్యంకాలేదు చలపతికి. 'వద్దులే నేను చేస్తాను' అని వారించాలేమో అనుకున్నాడు. కాని అది అటువంటి




సందర్భంకాదు. ఇంటికి యజమానిని అయిన స్త్రీ చేసుకోవలసిన పనులే అవి న్యాయంగా!

పరీక్షగా చూసింది జానకి. "ఛీ. నాన్నగారి కేమీరాదు. పిన్ని అక్క జడలెంత బాగా వేసిందో చూడండి. నాకూ నువ్వే వెయ్యి పిన్నీ" అంటూ తన రిబ్బన్లు లాగేసుకుని చిందులు ప్రారంభించింది.

చలపతీ సుభద్ర లిరువురూకూడ తెల్లబోయారు. చలపతి అప్పుడు పరీక్షగా చూశాడు. నిజంగానే సుగుణకు అందంగా జడలు వేసి చక్కగా రిబ్బన్లు కట్టింది సుభద్ర. స్త్రీ సహజమైన పనులు మరి అవి! జానకి పేచీ పెట్టడంలో అర్థం లేక పోలేదు. అయినా చలపతికి కోపం వచ్చింది "అన్నింటికీ పేచీలు పెట్టడం బాగా నేరుస్తున్నావ్ జానకీ. ఏమిటా పెంకెతనం?" అని కళ్ళెర్ర జేస్తూ చేయెత్తుతూంటే సుభద్ర వారించింది. "రా, నీకూ నేనే వేస్తాను" అంటూ జానకిని దగ్గరకు తీసుకుంది. చలపతి మనస్సులో సంతోషం, సంతృప్తి తావు

చేసుకున్నాయి. "ఏ దేవుని వరమో ఆమెలోని ఈ మార్పు." అంతలోనే తిరిగి భయసందేహాలు స్థానం పొందాయి. "హఠాత్తుగా యింత మార్పేమిటి? ఏమీ నటన కాదుకదా!"

సుభద్ర తలదువ్వి జడలు వేయడంతో తృప్తిపడి, మరి పేచీపెట్టకుండా అక్క వెంట స్కూలుకు వెళ్ళిపోయింది జానకి. కొద్దిసేపు అక్కడే ఏమి చేమిటో ఆలోచిస్తూ కూర్చున్న సుభద్ర తలెత్తి చూసేసరికి అక్క డెవరూలేరు తాను తప్ప. లేచి నెమ్మదిగా లోనికి దారితీసింది. మెల్లగా అడుగులు వేస్తూన్న ఆమెను పరుగు పరుగున వచ్చి ఢీకొని క్రింద పడిపోయాడు రవి. తనకు తెలియకుండానే లేవనెత్తింది సుభద్ర. రవి ఒళ్ళంతా నీళ్ళు కారుతున్నాయి అప్పుడే స్నానం చేసిన సూచనగా. అంతలోనే ఆ వెనకాలే రొప్పుకుంటూ రొజుకుంటూ నరసమ్మ వచ్చింది తువ్వాలుతో. "ముసలిదాన్ని నాయనా. నీ వెంటపడి పరుగు లెత్తలేను, దా మరీ" అంటూ బ్రతిమాలసాగింది.

"లానుఫో, వద్దుఫో." అంటూ రవి మరలా పరుగులంకించుకున్నాడు.

సుభద్ర రవి పరుగును ఆపి పట్టుకుంది. నవ్వుతూ నరసమ్మ చేతిలో టవలు తాను తీసుకుని రవి ఒళ్ళు తుడవసాగింది. రవి అల్లరిమాని సుభద్ర చేతుల గాజులూ. మెళ్ళోగొలుసులూ సవరించసాగాడు. రవి ఒళ్ళు తుడిచి పౌడరు వేస్తూన్న సుభద్రలో అంతలో మళ్ళీ "ఛీ. పిల్లెవరు? ఎవతె పిల్లలకు నేను సేవ చేస్తున్నాను? నా పిల్లలుకాదు. నాకూ నాథ్తకూ మధ్య ముళ్ళకంపలు!" అనే క్రోధభావం పాములా బుసకొట్టింది. ముఖంలోని ప్రసన్నత మాయమైంది. చేస్తూన్న పనిని ఆపి "ఊం. ఇక కానీయ్" అంటూ రవిని నరసమ్మ అందించేసి వెళ్ళిపోయింది

సుభద్ర ఆంతర్య మేమిటో అవగాహన కాని నరసమ్మ చిత్రప్రతిమే అయ్యింది

స్నానం చేయడానికి పోబోతూ చలపతికోసం వెదకిన సుభద్ర కనులు, అతడు వంటింట్లో వుండడం చూశాయి. తిరిగి ఆమెలోని తిరస్కారభావం తిరోగమించ సాగింది.

వంటకు అన్నీసిద్ధం చేసుకుంటూన్న చలపతి చేతిలోని గరిట తీసుకుంటూ "వంట నేను చేస్తాను లెండి" అన్నది అతిమెల్లగా.

తన వీనులు విన్నది నిజమేనా అనుకుని క్షణకాలం ఆలోచించాడు చలపతి. "నీకు వంటవచ్చా?" అన్నాడు.

సుభద్ర అదోక మాదిరిగా నవ్వింది. "పనులు రానంత సుకుమారంగా పెరిగినదాననా?"

చలపతి మనసు ఆర్ద్రపూరితమైంది. సుభద్ర లోనౌతూన్న అంతః సంఘర్షణను కొంత గ్రహించగలిగాడు. ఒకచేయి ఆమె భుజంమీద వేసి మరొక చేతితో కురులు సవరిస్తూ లాలనగా అన్నాడు: "ఎందుకు నీ కిష్టంలేని పనులతో సతమతం కావడం సుభద్రా? నువ్వు చెయ్యడం లేదని నే నేమీ అనుకోను. వెళ్ళు. వెళ్ళి స్నానం చేయి."

సుభద్ర వెళ్ళలేదు. "తర్వాత చేస్తాలెండి," అంటూ నెమ్మదిగా పనులలో లీనం కాసాగింది చలపతి సంతోషం నిజంగా అవధులు దాటిపోయింది. "అయితే కానీయ్. చెరోపనీ ఆడుతూ పాడుతూ చేసేసుకుందాం ఒకరి కొకరం సాయం చేసుకుంటూ. అలసటకూడా తెలియదు" అంటూ సుభద్ర బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టేలోగా తాను కూరలుకోశాడు. సుభద్ర వండుతూంటే ఆ కూరలలోకి కావలసిన మసాలా లవీ కొట్టియిచ్చాడు.

"ఏదీ చెప్పు. ఏం చేయాలో? పచ్చడి రుబ్బేస్తాను నేను."

సుభద్రలో ఆమెకు తెలియకుండానే కొంచెతనం తావుచేసుకున్నది. "రోజూ మీరే చేస్తున్నారుగా? ఇవాళ నేను చెప్పడమెందుకూ?" అన్నది నవ్వుతూ.

చలపతి తానూ నవ్వేశాడు. తలగోక్కుంటూ అన్నాడు: "అది నిజమే. కాని యివ్వాల్టికీ యిదివరకటికీ చాలా తేడాకన్పిస్తోంది. ఏదో కాస్త వుప్పూ, కారంవేసి యిన్ని నీళ్ళుపోసి వుడికించేయటమే కాని – నా మొఖం, నాకు వంటేమిటివచ్చూ? ఇవాళ నువ్వు వండుతూంటే వచ్చే ఘుమాయింపు వాసనలకే నాకు అంతా యిప్పుడే తినేయాలన్పిస్తోంది!"

చలపతి మాటలు అక్షరాలా నిజం! సుభద్ర వంట చాలా రుచిగావుంది పిల్లలూ చలపతీకూడా చాలా యిష్టంగా తృప్తిగా భోజనం చేశారు ఆ రోజు.

"అమ్మగారు చాలారుచిగా తయారుచేశారు అన్నీ" అన్నది నరసమ్మకూడా.

"పిన్నీ ఇకనుంచి వంటగదిలోకి అసలు నాన్నగార్ని రానీయకు, అన్నీ నువ్వే చెయ్యి. ఎంత బాగున్నాయో యివ్వాళ!" అంటూ తన సంతోషం ప్రకటించింది జానకి. వయస్సుకు చిన్నదీ ఏమీ తెలియని అమాయకురాలూ అయినా తన తొందరతో విచిత్ర విషమపరిస్థితులను ఏర్పరచే దిట్ట అయిపోయింది జానకి.

జానకి మాటలకు సుభద్రకు తప్పక కోపం వచ్చి తీరుతుం దనుకున్నాడు చలపతి. కాని ఏమీ మాట్లాడకుండా నిర్వికారంగా నిర్లిప్తంగా వుండిపోయిన సుభద్ర ముఖకవళికలలో ఏ భావమూ వ్యక్తం కాలేదు. పరధ్యానంగా ఏదో దీర్ఘాలోచనలో వున్నట్లున్న ఆమెను చూసిన చలపతి ఆమె ఏదో విపరీత సంఘర్షణకు లోనౌతూ అంతరాంతరాలలో అధికవ్యథ నందుతున్నట్లు గ్రహించగలిగాడు. లోలోన అతడు చాలా బాధపడ్డాడు, సుభద్ర నిస్సహాయ వేదనను వూహించుకుని. 'ఏమో! బాధపడ్తూన్న దని ఎందుకనుకోవాలి? ఆమె మాత్రం స్త్రీ కాదా? స్త్రీ సహజమైన సంసారదక్షతా, ఆలనాపాలనలు ఆమెకుమాత్రం వుండవా?...కాకుంటే అవి కొందరిలో మొదటే వుంటాయి; మరికొందరిలో నిబిడీకృతమై కాలక్రమానకాని ప్రవర్శితంకావు!' అని సరిపెట్టుకో జూచాడు మళ్ళీ. కాని ఎందుకో శంకాకులితమైన చలపతి మనస్సును అనుమానాంకురాలు వీడలేదు...'ఏమో, ఎందరో సవతితల్లుల గాథలు వింటున్నాం. ఇదంతా ఏదైనా పథకానికి నాందీ నటనేమో!' అనుమానంతో వణకిపోయిన చలపతి తన అనుమానం పైకి ప్రదర్శితంకాకుండా తనలోనే యిముడ్చుకుని జాగ్రత్తగా సుభద్ర చర్యలను గూఢచారి మనస్తత్వంతో పరిశీలించసాగాడు.

కాని వారంరోజులు తిరిగేసరికే తన భావన ఎంత నీచమైందో గ్రహించుకుని అమితంగా పశ్చాత్తాప పడ్డాడు చలపతి. 'సుభద్ర సాధారణ రాగద్వేషాలు గల మనిషేకాని, అల్పురాలూ, ఘాతకురాలూమాత్రం కాదు. ఆమెను అనుమానించవలసిందికానీ, ఆమెనుగురించి భయపడవలసిందికానీ లేశమైనా లేద'ని నిర్ణయించుకున్నాడు.

ఒకసాయంత్రం చలపతి ఇంటికి వచ్చేసరికి సుభద్ర రవిని ముస్తాబుచేస్తూ అల్లరిచేస్తూంటే ఏమిటేమిటో చెప్పి నవ్విస్తూ మరిపిస్తూన్నది. నరసమ్మ ప్రక్కనే నిలబడి నవ్వుతూ చూస్తూన్నది. సుభద్ర పనులుచేయడం ప్రారంభించాక నరసమ్మకూ, చలపతికీకూడ కొంత విరామం చిక్కి ప్రాణం సుఖపడ్తూన్నది. కాని...కాని చలపతి కెందుకో మనస్థిమితం లేదు; సుభద్రలో చలాకీతనం లేదు. తను చేయాలనుకున్న పనులేవో చేయడం, ఆపైన తనలోతానే యేమేమో తలపోసుకుంటూ మూగిగా కూర్చోవడం మామూలైపోయింది సుభద్రకు. సాయంత్రంవేళల్లో సినిమాలకూ, షికార్లకూ వెళ్దామని అడగటం మానేసింది. తనకుతానై చలపతి రమ్మంటే వెళ్ళటంవరకే ప్రస్తుతం ఆమె చేస్తున్నది.

'మళ్ళీ వివాహం చేసుకోమని అన్నదానికే ఆమె ఇంతగా లోలోన బాధపడు




తూన్నదా? ఆమెకు ఆనందాన్ని ద్దామనే సద్భావంతో పరోక్షంగా ఎంత అపకారం చేశాను నేను! ఈతప్పునెలా దిద్దుకోవడం?' అనుకొంటూ సుభద్ర బాధోపశమన మార్గాలకై అహర్నిశలూ ఆలోచించసాగాడు చలపతి.

# 12

పువ్వుల మాలలు కడ్తూన్న సుభద్రదగ్గఱకు వచ్చి కూర్చున్నాడు చలపతి.

మాల పళ్లెంలోవుంచి ప్రక్కను పెడుతూ "ఏమిటి?" అన్నది తలెత్తి సుభద్ర.

"ఆరోజున మనం నెక్లెస్‌కోసం వెళ్దామనుకున్నాం. అప్పటినుంచీ కుదరనే లేదు. ఇవ్వాళ వెళ్దామా?"

కొంచం ఆగి అన్నది సుభద్ర: "వద్దులెండి. రెండో వుండనే వున్నాయిగా?"

విస్మితుడై చూశాడు చలపతి. "అవి బాగులేదు, కొత్త మాడల్సులో కావాలన్నావు కదా సుభద్రా?"

సుభద్ర మాట్లాడలేదు.

"నడు సుభద్రా వెళ్దాం. కావాలనుకున్నప్పుడు మళ్ళీ అంత ఆలోచన దేనికి?" అనునయంగా అంటూ ఒకవిధంగా బలవంతంగానే లేవదీశాడు.

అయిష్టంగా అన్యమనస్కంగా లేచి బట్టలు మార్చుకుంది సుభద్ర.

షెడ్‌లోనుంచి కారు తీస్తూంటే పూలమొక్కల మధ్యన ఆడుకుంటూన్న సుగుణా జానకీ పరుగెత్తుకొచ్చారు, "ఎక్కడికి నాన్నగారూ?" అంటూ.

"ఎక్కడికీ లేదమ్మా. మీరు పోయి ఆడుకోండి," అన్నాడు చలపతి.

అంతలో వచ్చింది సుభద్ర.

సుభద్రను చూస్తూనే వెనుకకు తగ్గించి సుగుణ బెదురుతూ. పూర్వంవలె సుభద్ర యిప్పుడు తరచుగా కోప్పడటం మానేసినా పిల్లలలో వెనుకటి బెదురు యింకా అలాగే వుండిపోయింది.

"మనం ఆడుకుందాంలే జానకీ. నాన్నగారూ పిన్నీ ఎక్కడికో వెళ్తున్నారు. మనం వెళ్ళకూడదు," సుగుణ జానకితో ఎంత నెమ్మదిగా చెప్పినా ఆ మాటలు చలపతీ సుభద్రల చెవులను సోకనేసోకాయి.

గుండెలు పిండే బాధతో ఒక్కసారి అటుచూచి మళ్లీ ముఖం తిప్పేసుకున్నాడు చలపతి, నిస్సహాయవేదనతో.

సుభద్ర ఏమీ మాట్లాడలేదు. కారు తలుపుతీసుకుని లోపల కూర్చోబోతూ మళ్ళీ ఒక్కసారి వెనక్కు చూసింది. చిన్నగా ఏడుస్తూన్న జానకిని సుగుణ బలవంతంగా లాక్కెళ్తోంది. ఒక్కసారిగా సుభద్ర మనస్సులో వివాహోత్పూర్వం తన జీవితానుభవాలు కొన్ని మెదిలాయి. ఇద్దరన్నలూ, వదినలూ చక్కగా ఎక్కడికైనా వెళ్తూంటే తాను ఆశగా చూసేది. కాని తనను ఒక్కసారికూడా ఎవ్వరూ ఎక్కడికీ తీసుకువెళ్ళేవారుకాదు. తల్లికైనా తనపైన జాలి వుండేది కాదు. పెళ్ళవ్వకుండా యింటపడివున్నదానికి అన్నం పెట్టడమే గొప్పగా భావించే దామె. ఇక తండ్రికి అసలు సుభద్రను చూస్తేనే చిరాకు. ఈ గుది బండను ఎలా వదిలించుకోవటమా అనే తాపత్రయంలో ఆ గుదిబండను చూస్తేనే అసహ్యంగా వుండే దతడికి. అలా అందరికీ బరువై అన్నిటికీ ముఖంవాచి లోలోన బాధపడుతూ, భవిష్యత్తులో భర్తవల్ల సుఖపడాలనే ఆశతో బ్రతికేది సుభద్ర.

'భగవత్కృపవల్ల అన్ని సరదాలూ తీర్చే భర్తే దొరికారు. ఇల్లాలుగా యీ యింట అడుగుపెట్టిన అనంతరం, కలిమిలేనియింట కన్యగా అనుభవించిన కష్టాలలో వెయ్యోవంతుకూడా అనుభవించడంలేదు. మరి యింతగా సుఖంచుతూ కూడా యీ యింటిలోనివారిని నే నెందుకు ద్వేషించాలి?...అన్నీ తెలిసిన ఆ వయస్సులో నే ననుభవించిన మూగవేదనకంటె ఈనాడు అసలు ఏమీ తెలియని లేతవయసులోనున్న ఈ బాలికల నిస్సహాయవేదన అధికం కాదా?'

తర్కవితర్కాలకు తావునొసగిన హృదయంలో విశాలతా వివేకతలు స్థానం పొందగలగడం తథ్యం.

అందుకే సుభద్ర వెంటనే వెనుకకు వెళ్ళి జానకి కనులు తుడుస్తూ అన్నది: ఇంతమాత్రానికే ఏడుస్తావా జానకీ? రా వెళ్దాం. వెళ్ళి తొందరగా మంచి

జోళ్ళు వేసుకురండి. వెళ్ళు సుగుణా. తొందరగా రండి," అన్నది సుభద్ర. జానకి మహానందంతో గంతులువేస్తూ అయిదునిమిషాలలోనే తయారై వచ్చి కూర్చున్నారు. చలపతి మనస్సు సంతోషభావతరంగితమై ఉప్పొంగింది.

షాపులో నగలు నాణ్యం చేస్తూండగా "ఎవరికి పిన్నీ ఈ నెక్లెసులు?" అని ఆశ్చర్యంగా చూస్తూ అడిగారు సుగుణా జానకీ.

సుభద్ర మాట్లాడలేదు.

"రాళ్ళతో ధగధగలాడుతూ బలేగావున్నాయి. మనం కొనుక్కుందామా?" సుగుణ ఆశగా అడిగింది.

సుభద్ర అతిపరీక్షగా ఒక లాకెట్ గొలుసును పరీక్షిస్తూంది. ముత్యాలు, పచ్చలు, కెంపులూ పొదిగి పద్మంలాగ తయారుచేయబడిన ఆ పతకం నిజంగా చాలా అందంగా వుంది. దానికివున్న బంగారపు గొలుసుకూడ కొత్తరకం చేతలోవుంది.

"ఏం అది నచ్చిందా?" అని అడుగుతూ చలపతి ఆ గొలుసును తూకంవేసి ఖరీదు చెప్పమని షాపుఅతడిని అడిగాడు.

వాళ్ళకు అలవాటైన ధోరణిలో పైపైతూకం వేసేసి సుమారు ధర చెప్పేశాడు అతడు. "బంగారం నాలుగు కాసులుంది ముత్యాలూ, రాళ్ళూ, మజూరీ మొత్తం అంతా వెరసి సుమారు పదమూడువంద లుంటుంది; మీకు అదేకావాలంటే మధ్యస్థతూకంవేసి రాళ్ళూ ముత్యాలూ లెఖ్ఖగట్టి నికారైన ఖరీదుతో బిల్లు రాసిచ్చేస్తాను. లేదా యింకా ఏమైనా రకాలు కావాలంటే చూడండి.'' పెద్దబేరమే తగిలిందన్న సంతోషంతో పెట్టెలన్నీ తీసి వున్న రకాలన్నీ చూపిస్తూ అతిగా మాట్లాడేస్తున్నాడు నగలవర్తకుడు.

"ఏం సుభద్రా? అదొకటేనా యింకేమైనా కావాలా చూడు. బిల్లురాయించేయనా?" అంటూ సుభద్రవేపు తిరిగిన చలపతి, ఏదో మహా వింత విషయం విన్నదానిలా నోరావలించి విస్మయంగా చూస్తూన్న సుభద్రనుచూసి "ఏమిటి ఆలోచిస్తున్నావ్ అంతగా!" అన్నాడు.

"ఇవి... యివి...ఇంతింత ఖరీదులుంటాయా? ఇంతచిన్న గొలుసూ, పతకం పదమూడువందలే ఏకంగా!" అన్నది ఆశ్చర్యం స్పష్టీకరిస్తూ, వింతగా చూస్తూ.

అంతకు మునుపెన్నడూ బంగారాలూ, వజ్రాలూ నాణ్యం చేసినదీ ఖరీదు చేసినదీ కాకపోవటం మూలాన, బంగారం మొఖమే తెలియనిది కావటాన్నా, ఆమె ప్రదర్శించిన అజ్ఞానాశ్చర్యాలతో షాపు యజమానివద్ద తల కొట్టేసినంత

అవమానాన్ని అనుభవించాడు చలపతి. అయినా అంతలోనే తన కోపాన్నంతా అణచుకుంటూ "నీకేం నచ్చాయో చూడు, ధర ఎంతైతేనేం?" అన్నాడు.

సుభద్ర మీమాంస ఎటూ తేలకుండానే షాపుముందు ఆగిన కారులోంచి రమ దిగడం షాపువాళ్ళు ఆమెను ఎంతో గౌరవంగా ఆహ్వానించడం జరిగింది.

"ఓ! మీరూ యిక్కడే వున్నారా? ఏం తీసుకుంటున్నారు?" అంటూ మన సారా పలుకరిస్తూ సుభద్ర దగ్గరకు వచ్చింది రమ. చలపతికి నమస్కారం చేసింది. "ఏమ్మా అసలు రావడం మానేశారు మా యింటికి? బాగా చదువు కుంటున్నారా?" అని పిల్లలను అడిగింది.

"చదువుకుంటున్నామండి," అని అతి వినయంగా సమాధానం చెప్పింది సుగుణ.

"రామారావుగారు ఏరండీ?" అన్నాడు చలపతి.

"మగపిల్లలిద్దరూ బూట్లు కొనమంటున్నారు. అందుకని వాళ్ళనీ ఆయననీ జోళ్ళషాపులో వదిలి నేనిలా వచ్చాను, అరుణకు ఏమైనా కొందామని."

అలా మాట్లాడుకుంటూనే నగలను పరిశీలించసాగింది రమ. "ఏం తీసుకుంటు న్నారు మీరు?" అనడిగింది.

"ఇంకా చూస్తున్నామండీ," అన్నది సుభద్ర.

"ఈ లాకెట్ చాలా బాగుంది. పిల్లల మెళ్ళోవేస్తే మహా నాజూకుగా వుం టుంది!" అన్నది అంతకు ముందే సుభద్రచూసిన లాకెట్‌ను చూస్తూ. "సుమా రుగా ఎంత వుంటుందంటారు యిది?" అని షాపుయజమానిని అడుగుతూ తానే చేతితో ఎత్తిచూసి "వెయ్యి పైమాటేనేమో?" అన్నది.

"ఆఁ. పనన్నూరుడువందల ప్రాంతంలో వుంటుంది" అన్నాడు వర్తకుడు.

అరుణమెళ్ళో ఆ లాకెట్ పెట్టి చూసి "చాలా బాగుంది" అంటూ మురిసి పోయింది రమ. "ఇందుకు సరిపోయే ముత్యాల లోలకులేమైనా వుంటే చూపండి. మరీ పెద్దనికాక కాస్త పిల్లలకు బాగుండేవి."

ఇనుమడించిన ఉత్సాహంతో రకరకాల నగలన్నీ తీసి చూపుతున్నాడు వర్త కుడు.

"మరీ అంతంతసైజులూ, ఖరీదులూవద్దండీ. నూరు నూటయాభై మధ్యలో పిల్లలకు పెద్దే మోటు అన్పించకుండా వుండేవి తీయండి."

కావలసిన వస్తువును నిమిషాలమీద చకచకా ఎన్నిక చేసుకోగల నేర్పూ, వస్తువును చూస్తూనే దాని విలువను అంచనా కట్టివేయగల ఆమె కుశాగ్రబుద్ధినీ




చూసి లోలోన చాలా ఆశ్చర్యపోయింది సుభద్ర. చలపతికూడా రమ సామర్థ్యాన్ని చూసి "మంచి యిల్లాలు" అని లోలోన మెచ్చుకోకుండా వుండలేక పోయాడు.

అరుణ చెవులకు నూట డెభ్భైలో ఒక చిన్న ముత్యాల లోలకుల జత తీసుకుంది రమ. లాకెట్టు గొలుసుకూ లోలకులకూ కలిపి పదిహేను వందల పాతిక బిల్లు చెల్లిస్తూండగా రామారావు వచ్చాడు, ఇద్దరు కొడుకులతో.

చలపతినీ సుభద్రనూ పలుకరించాక, "ఏం యింకా అవలేదా నీ షాపింగ్? చూడనీ, ఏమేం కొన్నావో!" అన్నాడు భార్యను.

"ఇంతేనా కొన్నది మరి? ఇంకేం తీసుకోవూ?" అన్నాడు కొన్న నగలు చూశాక.

"చాలెద్దురూ. మళ్ళీ ఎప్పుడైనా కొనచ్చు కొంచం పెద్దదైన తర్వాత. చిన్నపిల్లలకు రోజూ ఎటూ వుంచం కదా నగలు. అప్పుడప్పుడూ పెట్టి చూసుకుందాం"

రామారావు అర్థంగానట్లు చూశాడు. "ఆ నగలు ఎవరికి రమా? అరుణకా? నీకు కామా?" అనడిగాడు.

ఆశ్చర్యపోయిం చేసింది రమ. "ఇంటిలో అన్ని నగలుంటే యింకా నాకెందుకు? అవి అలంకరించుకోవటానికే నాకు తీరిక సరిగా లేదాయె!"

"ఏమో! ఏమైనా కొత్తరకాలు కొనుక్కుంటావేమో అనుకున్నాను. అయినా అరుణకుమాత్రం లేవా యిదివరకు నగలు?" (సశేషం)


90మైళ్ళ స్పీడ్‌లో
కారు తోలినట్లు
కలొచ్చింది!
ఓహో అదా కథ!
ఇంజన్ మోతలాగా
రాత్రంతా ఒహటే
గురక!!
ఏవిటో అనుకున్నా-
Anjan


ఫర్నిచర్ కావాలా
సార్! - ఆధునికంగా
వుండాలా? లేక
మన్నిక వచ్చేవి
కావాలా?
Anjan





# అరుణోదయం

## కొడవటిగంటి కుటుంబరావు

రామ్మూర్తి ఎక్కడా తప్పకుండా బియ్యే పాసయినాడు. అన్ని పరీక్షల్లోనూ ఫస్టుమార్కులే.

చదువై పోతూనే రామ్మూర్తి భార్య కాపరానికొచ్చింది. తల్లిదండ్రు లిద్దరూ చచ్చి పోయినారు. అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ ఎవరూ లేరు. ఇంవై పుంరాం సుక్షేత్ర

మైన మాగాణీ ఉంది. ఇల్లుంది. రామ్మూర్తి భార్యతో స్వర్గసుఖం అనుభవిం సాగాడు.

పరీక్షల్లో ఫస్టుమార్కు లొచ్చినా ఆడదాన్లో ఇంత ఆనందం వుందని రామ్మూర్తి కి స్పష్టంగా తెలీదు. కామసుఖం గురించి బహిరంగంగా మాట్లాడేవాళ్ళంటే అత నికి భయంగానూ అసహ్యంగానూ ఉండేది.

నిజం చెప్పాల్సొస్తే రామ్మూర్తి స్తబ్ధు. అతని బుద్ధికి చైతన్యం తక్కువ. అతని ప్రపంచజ్ఞానం శూన్యం. అతనిలో కొంతయినా సంచలనం తెప్పించినమనిషి భార్యే

కల్యాణి పెద్ద చైతన్యంగల మనిషనికాదు. ఆమె అతనికన్నకూడా స్తబ్ధు.

కల్యాణిలో కామోష్ణత లేకపోపటమూ, చూసే మగవాళ్ళనందర్నీ ఆకర్షిం లక్షణాలులేనిది కావటమూ రామ్మూర్తి కి చాలా నచ్చింది. భార్యలు 'నిరపాయంగా ఉండటం భర్తల కెంతో హాయి.

రామ్మూర్తి కూడా నిరపాయమైన మనిషే గనక అందరూ అతన్ని ఆదరిం వాళ్ళు. అతను ఒకరితో మాట్లాడడు. మతవిషయికంగా గాని, రాజకీయంగాగాని "కొత్త పద్ధతులు" కోరేవాడు కాడు.

ఉద్యోగం చెయ్యాలనే ఆలోచన రామ్మూర్తి కి స్వతహాగా కలగనేలేదు. ఒకరికి పదిమంది, ఒకటికి పదిసార్లు, 'ఏమోయ్, పాపం, ఇంతపెద్ద చదువు చదివి ఊరికే ఉన్నావేం ?' అని అడిగేసరికి, లోకదాసయిన రామ్మూర్తి లోకహితంగా ప్రవర్తించ లేక పోయినందుకు పశ్చాత్తాప పడసాగాడు.

ఉద్యోగాలు చేసేవాళ్ళంతా, ముష్టివాళ్ళల్లేనే, జాలిపడవలసిన వాళ్ళని రామ్మూర్తి దృఢవిశ్వాసం. ఉద్యోగం దొరికేవరకూ ఉద్యోగం ముష్టెత్తాలి. ఉద్యోగం దొరికిన తరవాత, పాపం, వాళ్ళకీ కూలివాళ్ళకీ తేడా లేదు. జీతంలోతప్ప.

తాను సమగ్రంగా జీవిస్తున్నట్టే రామ్మూర్తి భావించాడు. రోజల్లా తన యిష్టం వచ్చిన పని చెయ్యొచ్చు. పుస్తకాలు చదువుకోవచ్చు. భార్యతో సల్లాపా లాడవచ్చు. ఎవరైనా స్నేహితులువస్తే బాతాఖానీ కొట్టుకోవచ్చు. ఈ క్షణాన ఇక్కడుండాలని నియమం లేదు. ఈ పని చెయ్యాలనే నిర్బంధంలేదు. జీవితాని కింకేం కావాలి ?

ఇట్లా ఉంటూ ఉండగా రామ్మూర్తి కారణాంతరాలచేత క్లబ్బులో చేరవలసి వచ్చింది. అతని స్నేహితులు చేరమని నిర్బంధించారు. రామ్మూర్తి క్లబ్బులో మెంబరుగా చేరి వెళ్ళసాగాడు.

ఇది నిజానికి చాలా మంచిపనే అయింది. క్లబ్బులో తనని అందరూ కొంచెం గొప్పగానే చూడసాగారు.

సీతారామయ్య ఒకనాడు నలుగురు పల్లెవాటు - గిరజాలవాళ్ళను క్లబ్బుకు పట్టు కొచ్చాడు. తీరా విచారిస్తే వారు సాహితీసమితివారని తేలింది. ఒకరు సమితి సభాపతి తల్లావఝుల శివశంకరశాస్త్రీ, మరొకరు దేవులపల్లి కృష్ణశాస్త్రీ, మరొకరు మునిమాణిక్యం నరసింహారావు, నాలుగో ఆయన వేదుల సత్యనారాయణ. అందరి పేర్లూ రామ్మూర్తి విన్నట్టే ఉన్నాయిగాని ఎవరెవరేం రాశారో అతనికి తెలీదు. రామ్మూర్తి ఎప్పుడయినా పత్రిక తిరగేసేవాడే. అతనికి పద్యాలెవరు రాసినా ఒకటిగానే ఉండేవి. కథలూ అవీ అసలు చదివేవాడుకాడు. బతికున్న రాతగాళ్ళకన్న పాతకవులే గొప్పవాళ్ళనే దృఢవిశ్వాసం తప్ప రామ్మూర్తికి సాహిత్యం గురించి స్పష్టమైన అభిప్రాయం లేదు. సుమతి శతకం పద్యాలైనాసరే పూర్వం అనేకసార్లు విన్న కవిత్వం బాగున్నట్టుండేది. కొత్త పద్యాలన్నీ గొడవగానే ఉండేవి. కాని అతని అదృష్టంవల్ల ఆనాడు దేవులపల్లివారు క్లబ్బులో కొన్ని సొంత పద్యాలూ ఇతర్ల పద్యాలూకూడా చదవటం జరిగింది. రామ్మూర్తికి ఆనందంతో ఉక్కిరిబిక్కిరయింది. ఆధునిక కవిత్వంలో ఇంత రసమూ జీవమూ ఉన్నాయని అతనికి తెలీదు. కవిత్వాన్ని ఆస్వాదించే 'విద్య' అతని కిన్నాళ్ళు లేకపోయింది. కృష్ణశాస్త్రి చదివిన పద్యాలిప్పుడు తన తలలో జోరీగలల్లే చేరి ఆలోచన తోచనివ్వటం లేదు... ఏ ననంత శోకభీకర తిమిర లోకైకపతిని...శోకభీకర తిమిర... కంటక కరీటధారినై కాళరాత్రి... ఇటువంటి తుంపులు అతని మనస్సులో చేపలు ఈదినట్టు ఈదసాగినై.

రామ్మూర్తి తను ఇంతకాలమూ సమగ్రంగా జీవించటంలేదని తేల్చుకున్నాడు. కవిత్వం! తన జీవితంలో కవిత్వం లోపించింది. పాతకవిత్వం చెత్త. దానికి రెక్కలులేవు... ఉప్పు కప్పురంబు ఒక్కపోలికనుండు... ఛీ ఛీ! వొట్టి వచనం; వొట్టి దుమ్ము! భావం మెరుపల్లే మెరవాలి, చలించాలి!

కవిత్వం రాయాలనే ఆలోచన వెంటనే రామ్మూర్తికి రాలేదుగాని కవిత్వంలో ఓలలాడుదామనే కాంక్ష అప్పటికప్పుడే అతనిలో ఉద్భవించింది.

* * *

ఇప్పుడు రామ్మూర్తికి జీవితం కొంతవరకు కరతలామలక మయింది. అతని ఇల్లు కవులకూ, నటకులకూ తదితర కళాకారులకూ రహదారి కావటంచూసి ప్రజలు వెనకటి మోస్తరుగా చీటికీ మాటికీ, "ఏదో ఒకటి చెయ్యరాదా?" అని అడగటం తగ్గించారు

తాను రచయితల జాబితాలో కెక్కటానికి రామ్మూర్తి చేసిన ప్రయత్నా లంత

సఫలం కాలేదనే చెప్పాలి. ముఖ్యంగా అతను కవిత్వంరాయాలనిపడ్డ బాధ బొత్తిగా వృధా అయిపోయింది. రామ్మూర్తి రాసిన వృత్తాలుచూసి సాటి కవులుకూడా, సహృదయులు సహితం, అంతబాగా కుదరలేదనే అనవలసి వచ్చింది. గీతాలురాసి చూడమన్నారు కొందరు. ముత్యాల సరాలయితే ఇంకా బాగుంటుందేమోనని కొందరభిప్రాయ పడ్డారు.

ఇవి రాయటానికి రామ్మూర్తి చేసిన కృషి వర్ణనాతీతం. ఎన్నోవందల గీతాలూ, డజన్లకొద్దీ ముత్యాల సరాలూ కంఠస్థం చేశాడు. వాటినడకను రక్తంలో కెక్కించుకున్నాడు. వాటిధ్వని చెవులలో మోగించుకున్నాడు. ఎన్నో డజన్లు గీతాలూ, ముత్యాల సరాలూ రాశాడు కూడానూ. ఛందస్సూ, యతులూ, ప్రాసలూ అన్నీ దిగినై. కాని పద్యాలకి రెక్కలులేవు. ఉన్నసంగతి అనుకోక తప్పేదేముందిగనకా? రామ్మూర్తి ఆత్మ ఇతర కవుల రెక్కలమీద ఎగరవలసిందేగాని సొంత రెక్కలమీద ఎగరటానికి నోచుకోనట్టు కనపడది.

ఈ విధంగా కవిత్వంకోసం దాదాపు రెండు సంవత్సరాలు వృధా అయిపోయినై. మరో సందర్భంలో ఎవరో ఒకరు, "నిజమైన కవితావేశం రావాలంటే అనేకరకాల అనుభవా లుండాలి. జీవితపు కట్టుబాట్లను తెంచి స్వచ్ఛందంగా ప్రవర్తించినవాళ్ళే గొప్ప కవిత్వం రాశారు." అన్నారు. ఈ సత్యాన్ని నిరూపించటానికా పెద్దమనిషి ఇచ్చిన ఉదాహరణలు వింటున్నకొద్దీ రామ్మూర్తికి మతిపోయింది. అతను దేనికైనా సంసిద్ధుదేగాని సంఘ నియమా లుల్లంఘించటానికి మాత్రం సంసిద్ధుడుకాడు. అందులోనూ ప్రత్యేకించి అతని జీవితానికి ధృవతార అయిన కల్యాణికి యత్కించిత్తు అన్యాయమూ చెయ్యటమనేది అతని కార్యక్రమంలో ఎక్కడా లేదు.

గడిచిన రెండు సంవత్సరాల కాలంలోనూ కళాస్పర్శ తగిలి రామ్మూర్తి మానసిక జీవితం ఇంత పరివర్తనకు గురి అయినప్పటికీ అందులో పీఠంవేసుకున్న కల్యాణిలో మాత్రం అణుమాత్రం మార్పురాలేదు. ఆమె మానసిక ఆకాశ్యంలో ఒక్క ఆకు కదలలేదు; ఆమె భావనా సముద్రంలో ఒక్కతరంగం పుట్టలేదు

ఈ సంగతి రామ్మూర్తి గ్రహించక పోలేదు. కాని అతనికి భార్యమీద అనురాగం తగ్గటానికి బదులు హెచ్చింది. ఇల్లువదిలి దూరం వెళుతున్నవాడికి ఇంటిమీద మమకారం హెచ్చినట్టుగా రామ్మూర్తికి తనభార్యయొక్క నిశ్చలత్వం మరింత ఆకర్షవంతంగా కనిపించింది. అదీకాక ఆమె అతని ఉత్సాహాన్ని భంగపరచలేదు.

వ్యసనాల్లోకి దిగకుండా తనకు కవిత్వం అబ్బని పక్షంలో కవిత్వం వద్దని తీర్మానించుకున్నాడు రామ్మూర్తి. ఈ సూత్రం నిజమవునో కాదో అతనికి తెలీదుగాని



ఇది విన్నప్పటినుంచీ అతనికి కవిత్వం రాయటంలో బొత్తిగా ఆసక్తి పోయింది. కాని ఇప్పటికీ కవిత్వం చదివే ఆసక్తి మటుకు దక్కింది.

ఈ దశలో అతను తలవని తలంపుగా ఒకకథ రాశాడు. ఈ కథ రామ్మూర్తి జీవితంలో ఒక ముఖ్యమైన ఘట్టమని చెప్పాలి. అది అట్టే గొప్ప కథకాదు. తానే రాసినప్పటికీ అది గొప్ప కథ అని రామ్మూర్తి కూడా అనుకోలేదు. అందులో ఉన్న కథాంశంలో నూతనత్వం ఏమీలేదు. ఒక ప్లీడరుగారు తన దగ్గరికి క్లయంటుగా వచ్చిన ఒక వేశ్య వలలో చిక్కుపడి ఆస్తి యావత్తూ పోగొట్టుకుని, చివరకు ఇంటి మొహంచూడని స్థితిలోఉంటే అతని పిల్లలిద్దరూ జబ్బుతో మంచానపడి వైద్యుణ్ణి తెచ్చేవాళ్ళుకూడా లేక చనిపోతారు. ప్లీడరుగారికి వేశ్యలను గురించీ, వేశ్యావృత్తిని గురించీ జ్ఞానం కలిగి, పశ్చాత్తప్తుడై భార్య దగ్గరికివచ్చి యథాప్రకారం కాలక్షేపం చేస్తాడు. అదీ కథ.

ఈ కథలో నూతనత్వం ఏమీలేదు కనకనూ, రచనాశిల్పంలోకూడా ప్రత్యేకత ఏమీలేదు కనకనూ గొప్పకథ కాదనుకోవటంలో రామ్మూర్తి సామాన్య విమర్శకులు పడే పొరపాటే పడ్డాడు.

మరో అయిదారు సంవత్సరాలలో అతను ప్రఖ్యాత కథకు డవుతాడని అతను అప్పట్లో ఏ మాత్రమూ భావించలేరు. "పరిణామం" అని పేరు పెట్టిన ఈ కథ రాసి అతను ఆరునెల్లు పైగా దగ్గర ఉంచుకున్నాడు. అది అచ్చులో పడకమునుపే దాన్ని ఇరవైమంది రచయితలూ, మరో నలభైమంది తదితరులూ విన్నారు. ఎన్నడూ రాయనివాడు ఒక కథ రాశాడంటే దానికి "న్యూస్ వాల్యూ" ఉంది. అది ఒక ప్రత్యేక వార్తకింద వ్యాప్తమవుతుంది. ''పరిణామం'' అనే అముద్రిత కథ ఒకటి రామ్మూర్తి దగ్గర ఉన్నదనే వార్త కొంతదూరం ప్రయాణం చేసింది. దాన్ని గురించి పుకార్లుకూడా బయలుదేరినై. అతను దాన్ని పెంచి నవలగా రాస్తున్నాడని ఒక పుకారూ, దాన్ని ఎంతమంది పత్రికలవాళ్ళడిగినా ఇవ్వలేదనే మరో పుకారూ విచ్చలవిడిగా ప్రజలలో వ్యాప్తమయినై. ఆఖరుకు దాన్ని ఎవరో పత్రికవారు అడిగి తెప్పించుకుని ప్రచురించారు. మామూలుగా ప్రచురితమైతే చదివి ఉండని అనేకమంది దాన్ని ఆసక్తితో చదివారు.

ఆరు నెలలు గడిచినై. రామ్మూర్తి మరో కథ రాస్తున్నాడని పుకారు పుట్టింది. రామ్మూర్తి స్నేహితులు ఈ రెండో కథకోసం ఎదురు చూస్తున్నట్టు నలుగురికీ కనిపించసాగారు. కాని ఈ రెండో కథ మరో నాలుగు నెలలవరకూ బయటికి రానేలేదు. దీనిపేరు ''ప్రాయశ్చిత్తం''. "ప్రాయశ్చిత్తానికీ", "పరిణామానికీ" కొంతవరకు ఏకమేధో జనితమైనందుకు పోలికలున్నా పరిశీలనాపరులకు తేడాలు కనిపించకపోలేదు.

"ప్రాయశ్చిత్తం"లో నాయకుడు డాక్టరు. అతని దగ్గరకు ఒక రోగి వస్తాడు. అతని భార్య జారిణి. డాక్టరును – అన్యసతీ విముఖుణ్ణి – ఆవిడ వలలో వేసు కుంటుంది. కానీ ఇవ్వకుండా భర్తకు వైద్యం చేయించుకుంటుంది. తన దారిన తాను పోతుంది. ఆవిడ పబ్బం గడుపుకుపోయిందని తెలుసుకోక ఆమె ప్రేమచేత దహించుకుపోయినవాడై మన డక్టరు అహర్నిశలు కృంగి కృశించిపోతాడు. ప్రాక్టీసు చెయ్యలేకపోతాడు. ఒక రోగికి ఇంజెక్షన్ ఇవ్వవలసి వస్తుంది. డాక్టరు చెయ్యి వొణుకుతుంది. రోగిప్రాణాని కెంత కావాలి? ఇంజక్షను సరిగా ఇవ్వని కారణాన రోగి చచ్చిపోతాడు. డాక్టరు లైసెన్సు పోతుంది. బికారి అయిపోతాడు. అతన్ని ఈ గతికి తెచ్చిన కులట డాక్టరు స్థితి తెలుసుకుని పశ్చాత్తాప పడి, తాను పతితురాలననినీ, ఇటువంటివారిని చూసి మోసపోవద్దనీ అతనికి జాబు వ్రాసి తాను బావిలో దూకి ఆత్మహత్య చేసుకుంటుంది. డాక్టరు జ్ఞానోదయం కలిగినవాడై తిరిగి భార్యతో సుఖంగా సంసారం చేసుకుంటూ యథాప్రకారం వైద్యం చేయసాగుతాడు.

అతని జీవితాన్ని బహు శ్రద్ధగా పరిశీలిస్తూ ఉండిన వైద్యాధికారులు అతనిలో కలిగిన "పరిణామానికి" సంతసించి అతని లైసెన్సు అతనికి తిరిగి ఇస్తారు. ఈ లైసెన్సును డాక్టరుగారి భార్య తన స్వకీయ కరకమలాలతో డాక్టరుకు అందిస్తుందనీ, వొణుకుతున్న చేతులతో, అశ్రుపూరిత నేత్రాలతో, గద్గద కంఠంతో అతను దాన్ని అందుకుంటాడనీ పాఠకులకు వేరే చెప్ప నవసరంలేదు.

"పరిణామం" బాగుందన్నవాళ్లు "ప్రాయశ్చిత్తం" ఇంకా బాగుందన్నారు. జరిగిన సంవత్సరం కాలంలోనూ రామ్మూర్తి శిల్పపటిమ బాగా హెచ్చినట్టు భావుకులు భావించారు. అతనికి కథా రచయితల పట్టీలో అనల్పమైన స్థానం ఏర్పడ్డట్టు సహృదయులు సవిశ్వాసంగా చెప్పారు.

రామ్మూర్తి రాసిన మూడో కథను గురించి వివరాలివ్వటానికి ఈ రచయితకు చెయ్యి రాకుండా ఉంది. ఈ ఘట్టాన్ని దాచి పెట్టటం, లేక మరుగుపరచటం, ఒక విధంగా న్యాయసమ్మతమైనదే. కాని ప్రసిద్ధ పురుషులు చేసే లోపాలలోకూడా మనబోటివాళ్ళు నేర్చుకోదగిన నీతి ఉంటుంది. ఈ ధైర్యంతోనే ఈ విషయం బహిర్గతం చెయ్యటమయింది.

ఈ మూడో కథ పేరు – పాపం శమించుగాక! – "జంట కోయిలలు". ఇందులో ఇద్దరే పాత్రలు, నాయికా నాయకులు. నాయకుడు కవి, గీతా లాలపిస్తాడు. నాయిక అతని భార్య; ముగ్ధ; అభమూ, శుభమూ ఎరగని అమాయకురాలు ఆమెను కవి గగన వీధులన్నీ తిప్పుతాడు. ఆమెలో ఆవేశం వొస్తుంది. ఆమెకూడా తియ్యగా గీతాలాలపించటం మొదలుపెడుతుంది. అంతే కథ.

రెండోకథ వెలువడిన నాలుగు నెల్ల కాలంలోనే ఇది వెలువడింది. నిశితవిమర్శకులు దీన్ని, "కథకాదు, కథాచ్యుతి" అన్నారు. సానుభూతి రహితులు ఇందులో చాలా లోపాలు చూశారు. నాయికకూ రామ్మూర్తి భార్య అయిన కల్యాణికీ పోలికలు చూశారు. ఎంత కవికోకిల అయినా పరస్త్రీతో గానం చేయక స్వస్త్రీ సాంగత్యంలో గానం చెయ్యటం – మీదు మిక్కిలి ఆమెతో కంఠం కలిపి గానం చెయ్యటం – లోక విరుద్ధంగా ఉందన్నారు. కవి అయినవా డిట్లా ఎన్నటికీ రాసి ఉండడన్నారు.

రామ్మూర్తి తన తప్పు గ్రహించుకున్నాడు. అతని నాలుగో కథా, అయిదో కథా, ఆరో కథాకూడా అతని మొదటి రెండు కథల లాటివే. ఒక కథలో కాలేజీ లెక్చరరొకతను తన దగ్గర చదువుకునే విద్యార్థిని వలలో పడిపోతాడు. మరో కథలో ఒక ధనికుడు ఆస్పత్రిలో ఉండి ఒక నర్సు వలలో పడిపోతాడు. ఇంకో కథలో ఒక మునసబుగారు ఒక ప్లీడరుచెల్లెలు వలలో పడిపోతాడు. అన్ని కథల

లోనూ నాయకులు బుద్ధి తెచ్చుకుని భార్యల దగ్గరికి తిరిగివస్తారు. ఒక్క కాలేజీ లెక్చరరు మటుకు తన భార్యనే కోల్పోయి ఆమె ఫోటో ఎన్లార్జిమెంటుతో వాస ప్రస్థం ప్రారంభిస్తాడు. అతని పరివర్తనను ఆహ్లాదించేటందుకు విద్యార్థులు ఉపకరిస్తారు. ఈ కథలన్నీకూడా మొదటి రెండు కథలూ గడించినంత కీర్తి గడించినై. కథకుడుగా రామ్మూర్తి కీర్తి అసలుకు చేరే వడ్డీలాగా ప్రతి కథతోనూ హెచ్చిపోయింది.

రామ్మూర్తి ఏదో కథ రాయనేలేదు. ముఖ్యకారణం అతని ఆస్తి యావత్తూ అప్పులవాళ్ళ పాలయిపోయింది. అతను మట్టుకు ఇల్లుతోనూ పెళ్లాంతోనూ మిగిలాడు. అది వేరే కథ.

* * *

ఇంతవరకూ మనం రామ్మూర్తి గృహ జీవితం జోలికిపోలేదు. అతనికి ఆర్థిక సమస్యలు లేనంతకాలమూ మనకా అవసరం లేకపోయినా ఇప్పుడతను ఆస్తంతా పోగొట్టుకున్నాడు గనక, ఇంత అన్యాయం కలగటానికి కారణ మేమిటని విచారణ చెయ్యటం అప్రస్తుతం కాదు.

రామ్మూర్తి ఆస్తి దాదాపు ఇరవై ఎకరాలుండి. పట్టాల ప్రకారం ఈ ఇరవై ఎకరాలు ఎక్కడో మారుమూల పల్లెటూళ్ళో ఉంది. ఆ భూమిని రామ్మూర్తి చూసిన పాపాన పోయి ఎరగడు. రామ్మూర్తి దగ్గరబంధు వొకాయన - వాళ్ళ స్వగ్రామం ఆ మారుమూల పల్లెటూరే - ఆ పొలం కవులుకివ్వటమూ, గింజలు కొలిపించుకోవటమూ, దాన్ని విక్రయించటమూ రామ్మూర్తి అవసరాన్నిబట్టి డబ్బిస్తూ వుండటమూ మొదలయినవి చేస్తూ వుండేవాడు. ఆయన రైతుల్ని ఒత్తిడిచేసి బోలెడంత గడ్డీ, జనుమూ, పెసలూ, మినుములూ, మిరపకాయలూ లంచం గుంజుతున్నాడనీ, పంట కళ్లాల్లో మార్కెటు ధరకు ఓ రూపాయ తక్కువచేసి తనేకొని మంచి ధరకు విక్రయిస్తున్నాడనీ, మొత్తంమీద ఆయన యింటి ఖర్చంతా రామ్మూర్తి పొలంమీద రాబడితోనే గడిచిపోతున్నది గాని సొంత పొలంలోది ఒక్క గింజ ముట్టటం లేదనీ, తనకు పాడిబర్రెల దగ్గర్నించీ లంచాలు పెట్టే రైతులకే తక్కువ మక్తాకైనా కవులిస్తున్నాడనీ, తన సొంత పొలం కవులు రామ్మూర్తి పొలంకన్న ఎకరానికి రెండుబస్తా లెందు కెక్కువుందో గమనించమనీ కొందరు రామ్మూర్తి దగ్గరికి వచ్చి ఫిర్యాదులు చేసిపోయినారు.

రామ్మూర్తి సహజంగా డబ్బుజ్ఞానం ఎక్కువ కలవాడు కాదు. కాని ఆ దిక్కుమాలిన పల్లెటూరునుంచి ఏటా ఎవరో ఎరగని రైతులు వచ్చి, "మీరు కవులు




రాయించుకోండి, బాబూ. మీ యిష్టం వొచ్చిన కవులిస్తాం! ఆయనతో వేగలేకుండా వున్నాం. ఎంత పెట్టినా ఇంకా తే అంటే పిల్లలు గలాళ్ళం చచ్చిపోమా?" అని లబలబలాడుతుంటే కొంత ఆరాటం పుట్టినమాట నిజమే. ఆస్తి అంటూ వున్న తరువాత అది దోపిడి అవుతున్నదంటే ఎవరికైనా బాధగానే ఉంటుంది. అయితే పాపం, రామ్మూర్తికి తన బంధువును నిలబెట్టి "ఏమిటి ఇట్లా చేస్తున్నావుట?" అని అడిగే ధైర్యంలేదు. పొలం మేస్తున్నవా డంతో ఇంతో తినకుండా వొట్టి పుణ్యానికి చూస్తాడనటంకూడా ధర్మంకాదు. కాని ఎంత తింటున్నాడనేది తేల్చుకోవాలని రామ్మూర్తికి అభిలాష కలిగింది. ఇందుకోసం పనిపెట్టుకుని అక్కడికి వెళ్ళటానికి కాళ్ళాడలేదు.

అదృష్టవశాత్తూ ఏదో కోర్టులో సాక్ష్యం ఉండి ఆ బంధువే చక్కా వచ్చాడు. మాటల సందర్భంలో రామ్మూర్తి, "ఏం మామయ్యా! మన పొలానికింకా మక్తా ఎక్కువ ఇస్తామంటున్నారే!" అన్నాడు.

మామయ్య భోళాశంకరుడల్లే సగం పళ్లూడిన నోటితో పొట్ట ఎగరేసుకుంటూ నవ్వి, "మాలవాళ్లు నీ దగ్గర కొచ్చారటగా? విన్నాలే! వాళ్లిస్తామనరుట్రా మరీ? ఇవ్వకపోలే కౌరత వేస్తామా? వాడి కేమన్నా వెనక ఉండేడిస్తేగద? కళ్లాలు నూర్చి పదిబస్తాలు చూపించి ఇంతే రాలినయ్యి బాబూ అంటే వాణ్ణేం చేస్తావురా?...

అప్పటికీ నేను ఏకసాలు కవులే ఇస్తున్నా, పోనీ వచ్చే ఏడన్నా మంచి రైతౌస్తా దేమో అని. ఎబ్బే! అసలు రైతు వొత్తిడి లేందే? వొట్టి పాపిష్టి ఊరు! ఈ బాధ పళ్ళేక నేను సొంతాన సహంపొలం చేస్తున్నా." అని ప్రారంభించాడు.

ఇక రామ్మూర్తి మాట్లాడలేదు. ఈ పొలం పని తనవంటి వాళ్ళకు కాదు. ఏదో ఏటా వెయ్యిరూపాయలదాకా వస్తున్నది. పైన వందా, రెండొందలూ కావాలంటే మామయ్యే అప్పిస్తున్నాడు. ఎందుకొచ్చిన ఆరాటం తనకు?

పొలంకు సంబంధించిన సమస్య లీ విథంగా పరిష్కారం కాగా అతనికి అప్పు బాధ కించిత్తు ఉంటూవచ్చింది. ఈ అప్పు ఏడెనిమిది వేలకు మించదు. తనబోటి ఆస్తిపరుడు కంగారు పడవలసిం దేమీలేదు. (మధ్య తరగతి భూస్వాముల్లో అప్పు లేనివాడెవడు? ఎవరుబడితే వాళ్ళన్నట్టు, ఎంత చెట్టు కంతగాలీ!) కాని ఇది తీరే ఉపాయం లేకపోవటం ఎప్పుడైనా ఒక్కసారి రామ్మూర్తిని కొద్దిగా బాధించేది.

ఈ ఏడెనిమిది వేల అప్పూ ఒక్కనాడు చేసినదికాదు. ఎన్నడో తన వివాహం అయినప్పుడు పదిహేను వొందల అప్పయింది. ఆట్టే వడ్డీకూడాలేదు. నూటికి నెలకు ఒకరూపాయి మాత్రమే. ఆ తరువాత బియ్యే చదువుకు మరో వెయ్యిరూపాయలు అప్పు చెయ్యవలసివచ్చింది. ఈ అప్పంతా తన "మామయ్య" ద్వారా వర్తకుల దగ్గర చేసినదే. అప్పు తాలూకు వడ్డీ అయినా తీరుస్తూ రావటానికి వీలు చిక్క లేదు. పొలంమీద వచ్చేది ఇంచుమించు ఇంటి ఖర్చుకు సరిపొయ్యేది. ఆ పాత అప్పంతా కలిసి రామ్మూర్తి కథా రచయిత అయేనాటికే ఏడెనిమిదివేల మధ్యకి దేకింది!

అంతకు పూర్వం రెండేళ్ళు ముందునుంచీ రామ్మూర్తి నిత్య ఖర్చుకోసం ఏటా నాలుగయిదు వందలు అదనంగా అప్పు చెయ్యటం ప్రారంభించాడు. ఏమీలేనివాళ్ళ కేదీ ఉండదు. నలుగురూ వస్తూపోతూవుంటే ఇంట ఖర్చుకేం లోటూ? అంతో ఇంతో పొలం అమ్మకుండా అప్పు తీరేటట్టు కనబడలేదు.

మరో నాలుగేళ్లు గడిచింది. 1930 పైనబడ్డది. ఆర్థిక కాటకం మీద పడ్డది. డబ్బు మాయమయింది. ధరలు చచ్చినై. అప్పుల వాళ్ళంతా ఏదోకాడికి పొలా లంటగట్టుకుంటున్నారు. పొలాలు కొనే నాథుడు లేడు. ఆఖరుకు ఎకరం ఎనిమిది వందలు చేసి షావుకార్లు పొలం అంటగట్టుకున్నారు.

సెంటు బొలం మిగలకపోయినా రామ్మూర్తి మటుకు కానీ అప్పు లేకుండా బయటపడ్డాడు. చేతికి రెండొందలు రొక్కంకూడా వచ్చింది.

ఈ పొలంపోయిన కొత్తలో రామ్మూర్తి ఇంత ఆపదా తనకే సంభవించినట్టూ



ఇన్నాళ్ళూ తనను కనిపెట్టి వున్న భగవంతుడికి అకస్మాత్తుగా తనమీద దయ తప్పినట్టూ భావించాడు. కాని ఎన్నో వేల మందికి తన గతే పట్టిందని తెలిసినప్పుడా బాధ కొంత ఉపశమించింది. ఈ ఆర్థిక ప్రళయం ఏ కారణంవల్ల కలిగిందో దాని వెనకవున్న పైశాచిక ఆర్థిక సూత్రాలేమిటో రామ్మూర్తి ఏమీ ఎరగడు. తాను స్వతంత్రజీవి ననుకున్నాడు. పదేళ్ళపాటు తన ఇష్టం వచ్చినట్టు జీవించానని నమ్మాడు. ఆ స్వాతంత్ర్యాన్ని ఇరవై ఎకరాల ఆస్తితో కొనుక్కున్న సంగతికూడా అతనికి స్పష్టంగా తెలియలేదు. ఇకముందు తాను వెనకటి మాదిరిగా కళాసేవ చేసే

అవకాశం ఉండదనీ, శాశ్వతంగా నాలుగు కాలాలపాటు నిలిచే సాహిత్యం రాయ లేననీ విచారించాడేగాని, తనలో సహం ఈడున్నవాళ్ళు వచ్చి తనకు జీవిత సత్యాలు చెబుతారనీ, తాను రాసిన ప్రఖ్యాత కథ లెవరికీ ఎందుకూ ఉపకరించవనీ అతనికి తెలీదు.

ముందు చూస్తే జీవితమంతా ఎడారిగా కనబడ్డది. ఉన్న ఇల్లు తప్ప అతని కే ఆధారమూ లేదు. ఇంతకాలమూ నిరసించిన ఉద్యోగం చెయ్యాలి. అదైనా ఎవ రిస్తారు? సొంతాన "ఏపన్నా" చేసుకుందామంటే "ఏదన్నా" చేసుకునే రోజులు కావు. మళ్లీ ఆ రోజులు తిరిగివచ్చే సూచనలైనా కనిపించలేదు.

చేతిలో మిగిలిన రెండుపంపలూ అయిపోయినై. ఇంటోవున్న వెండిసామాను చాలా భాగం అయిపోయింది. భార్య వొంటిమీది బంగారంకూడా దాదాపు అయిపో యింది. రామ్మూర్తి తోణకలేదు. సంవత్సరం గడిచింది. ఎప్పటికైనా ఏదో జరిగి తీరుతుందనీ, తను ఎల్లకాలమూ ఈ స్థితిలో ఉండడనీ అతనికి తెలుసును.

ఇంతలో ఏదో జరగనే జరిగింది. ఒకనాటి ఉదయం తొమ్మిది గంటలకు ఒక స్నేహితుడు వచ్చి, "పట్నంలో నా స్నేహితు డొకాయన పత్రిక పెడతాట్ట. నువు దానికి సంపాదకుడుగా వెళతావా?" అని అడిగాడు.

రామ్మూర్తి తోణకలేదు. ఏమీ తొందర పడలేదు.

"పత్రికలు పెడతామన్నంత మాత్రంచేత లాభంలేదు. ఎవరా పెట్టేది? ఎంత డబ్బుతో పెడతారు? ఏమిటి కథ?" అన్నాడు. పొరపాటునకూడా అతను, "నా కేమిస్తారు?" అని అడగలేదు.

* * *

1930 నాటి ఆర్థిక కాటకంలోనుంచి అనేకం పుట్టినై. తెలుగువాళ్ళ సంస్కార జీవితంలో కలిగిన నూతన సృష్టిలో చెప్పుకోదగినవి పత్రికలూ, టాకీలూనూ.

ఒక పరిషత్తు తోడ్పాటులేకుండా, ఒక ఉద్యమం నడపకుండా దేశమంతటా రకరకాల పత్రికలు పుట్టి సాహిత్యాన్ని ప్రజలందగ్గరికి తెచ్చినై. వాటిలో వెలువడిన సాహిత్యం ఏతరగతి సాహిత్యమనేది ఎక్కువ ముఖ్యమైన విషయంకాదు. పత్రి కలు ఉత్తమ సాహిత్యంకోసం ఆందోళన చెయ్యలేదు. చేతికందిన కథలూ, వ్యాసాలూ ప్రచురించి జనసామాన్యంలో పఠితల్ని వేలసంఖ్యలో పెంచినై. సాహిత్యపిపాసా, సాహిత్యాభిలాషా కొత్తదారి తొక్కినై. ఒకప్పుడు తమకు సాహిత్యరచనగాని పఠనగానీ చేసేఅర్హత లేదనుకున్న తరగతులలోనుంచి రచయి తలూ పఠితలూ బయల్దేరారు. పత్రికా నిర్వాహకులుకూడా కొత్తరకంవారు ముందు

కొచ్చారు. మందులమ్ముకునేవాళ్ళూ, నగలవర్తకులూ పత్రికా నిర్వహణానికి పూనుకున్నారు. వారికి సాహిత్యాభిలాష లేదు. వాళ్ళకు ముఖ్యంగా కావలసింది తమ వస్తువులకు ప్రచారం జరగటం, రెండోది పత్రికలమీద లాభాలు తియ్యటం.

అయితే రామ్మూర్తిని మద్రాసు పిలిపించిన పెద్దమనిషి ఈ తరగతికి చెందినవాడు కాడు. పత్రిక పెట్టడానికి ఆయన్ని పురిగొల్పింది సాహిత్యాభిలాషే. ఆయన చాలాకాలంగా పట్నంలో ఉండి గవర్నమెంటు నౌకరిచేసి విరమించాడు. డబ్బుకేమీ లోటులేదు. జార్జిటవును సందుల్లో ఒక ప్రెస్ అమ్మకానికొస్తే చవుకగా కొని దాని ద్వారా ఒక మాసపత్రిక నడపాలని ఆయనకి అభిలాష కలిగింది. దాన్ని నడపటానికి ఎవర్ని పెడితే బాగుంటుందని విచారించగా ఎవరో రామ్మూర్తి పేరు సూచించారు. ఇక మరో ఆలోచనచెయ్యక తననూ రామ్మూర్తినీ ఎరిగున్నవాళ్లున్నట్టు తెలుసుకుని వారిద్వారా రామ్మూర్తికి కబురుచేయించాడు. ముందు రామ్మూర్తి ఒకడే పట్నం వచ్చాడు. అన్నివిషయాలూ మాట్లాడుకున్నారు. పరదయ్యపంతులుగారు రామ్మూర్తికి నామకః నెలకు వంద జీతం ఇస్తానన్నాడు. ఒకప్పుడు రామ్మూర్తికి నూరురూపాయలేమూలా చాలేదికాదు. కాని కొటకిం కావటంమూలాన అదే చాలా ఎక్కువగా కనపడింది.

పత్రికలో ఆధునిక కవుల పద్యాలూ, గేయాలూ, కథలూ, విమర్శక వ్యాసాలూ, కళాచర్చలూ, పుస్తక సమీక్షలూ మొదలైనవి ప్రచురించటానికి నిర్ణయించాడు రామ్మూర్తి. అడివివాడు చక్కని ముఖచిత్రంవేసి ఇస్తామన్నాడు. చింతా దీక్షితులూ, మునిమాణిక్యంవారూ, శ్రీనివాస శిరోమణీ. నోరివారూ ఇతరులూ కథలు రాస్తామన్నారు. విశ్వనాథవారూ, కొడాలివారూ, కొమ్ముండూరివారూ మొదలైనవారు పద్యాలు రాస్తామన్నారు. నండూరివారు యెంకిపాట ఒకటి పంపారు. పత్రిక వెలువడటానికి అన్ని సన్నాహాలూ జరుగుతున్నాయి.

ప్రెస్సున్నచోటే పత్రికకు ఒకగది చాలాభాగం ఖాళీచేసి ఇచ్చారు. ఒకమూల చెస్సులూ, బైండుగాని పుస్తకాలకట్టలూ, చెక్కలూ, పాతబడిన సైపులపోగూ ఉన్నప్పటికీ గది "కలావాణి" ఆఫీసుగా మారిపోయింది. రామ్మూర్తికి ప్రింటింగు గొడవ ఏమీతెలీదు. కాని ఆమాట అతను పైకి అనదలుచుకోలేదు. ఎవరికీ తెలియకుండా కాలక్రమాన నేర్చుకోవచ్చును.

రోజూ ఒకరిద్దరు సాహిత్యపిపాసువులు రామ్మూర్తి దర్శన పరిచయభాగ్యాలు పొంది, సాహిత్యచర్చచేసి, జేబులో పెట్టుకొచ్చిన వ్యాసాలు సమర్పించి వెళ

తున్నారు. ఈ సాహిత్య చర్చలలో సామాన్యంగా ఆధునికకవులప్రశంసే వస్తూండేది.

కాని ఒకనాడు రామ్మూర్తిదగ్గర కొక కుర్రాడొచ్చాడు. అతనికి ఇరవై ఏళ్ళకంటే ఉండవు. ఏదో మాటమీద మాటొచ్చి అతను భావకవిత్వం దక్కదన్నాడు. రామ్మూర్తికి ఆశ్చర్యంవేసింది. భావకవుల్ని తిట్టేవాళ్ళంతా యాభైపయి చిల్లర వాళ్ళనీ, వాళ్ళ నోళ్ళుకూడా క్రమంగా బలహీనం అయిపోతున్నయ్యనీ అనుకుంటూ వచ్చాడు రామ్మూర్తి. గుడ్డువచ్చి పిల్లను వెక్కిరించినట్టు ఈ ఇరవై ఏళ్ళ రాలుగాయి భావకవిత్వాన్ని విమర్శించటం రామ్మూర్తికి ఆశ్చర్యంవేసింది.

'నేటి కవులలో తెలుగుజాతియొక్క వాక్కున్నవాళ్ళు బహు కొద్దిమంది' అన్నాడు కుర్రాడు. 'గురజాడ అప్పారావుదగ్గర ఈ వాక్కు కనిపిస్తుంది, బసవరాజు అప్పారావుదగ్గర కనిపిస్తుంది. నండూరి సుబ్బారావులోకూడా కనిపిస్తుంది' అన్నాడు కుర్రవాడు.

ఉన్నకథకుల్నిగురించి రామ్మూర్తి కుర్రవాడి అభిప్రాయం అడిగాడు.

'జ్ఞాపకం ఉంచుకోదగిన కథలు రాసేవారెవరూ లేరు. ఒక్క గుడిపాటి వెంకటచలం కథలుమాత్రం చక్కని శిల్పంతో కూడుకుని ఉంటై. ఈశిల్పం పైనుంచి దిగుమతిచేసినదైనా అతివేగంగా తెలుగువాళ్ళ సొత్తయిపోతున్నది. కాలక్రమాన దేశంలో మిగిలేది చలంగారు తెచ్చిన శిల్పమే...ఆయన తెచ్చే కథావస్తువుకూడా దిగుమతి సరుకే. పాశ్చాత్య నాగరికతా వ్యామోహంతప్ప చలంగారికథల్లో ఏమీ కనిపించదు. స్త్రీపురుషులు స్వేచ్ఛగా విహరించాలనీ, సంఘంలోవున్న కట్టుబాట్లు యువకుల ఆనందాని కడ్డొస్తున్నాయనీ ఆయనకి విచారం. ఈ కట్టుబాట్లు ఎవరో కావాలని పెట్టినవైతే వాటిని తీసెయ్యటం సాధ్యమౌను. ఇవి ఎందుకొచ్చిందీ చలంగారికి తెలీదు. అందుచేత ఆయన వాటిని తన కథలద్వారా ఎప్పటికీ మార్చలేడు. చలంగారికి కావలసిన స్వేచ్ఛాయుతమైన సంఘం పాశ్చాత్యదేశాల్లో కాదుకదా, ఎక్కడా లేదు. వంటింటికీ వరాసాకీమధ్య గోడ కట్టుకుంటాం. స్నానాల గదయితే కిటికీలకి మరింత భద్రంగా తలుపులు పెట్టుకుంటాం. స్వేచ్ఛ కావాలని ఎవరమూ వెళ్ళి బట్టబయలులో నివసించం.'

"మీ కెటువంటి సాహిత్యం నచ్చుతుంది?" అని అడిగాడు రామ్మూర్తి నవ్వుతూ.

"నాకు నచ్చిన పాట 'మాకొద్దీ తెల్లదొరతనమూ' అనేది" అన్నాడా కుర్రాడు

"అది కవిత్వంకాదు. ప్రచారం," అన్నాడు రామ్మూర్తి.



"ఏ ప్రచారమూ చెయ్యలేకపోతే అది కవిత్వమేకాదు," అని జవాబిచ్చాడు కుర్రాడు.

కృష్ణశాస్త్రి కృష్ణపక్షంకంటె మాకొద్దీ తెల్లదొరతనం మంచి కవిత్వం అనటం ఎట్లా? కుర్రాడు మొండివాదన చేస్తున్నట్లు తోచింది రామ్మూర్తికి.

"కవితాశిల్పం మాటేమిటి?" అన్నాడు రామ్మూర్తి.

"అవును మీరు శిల్పం చూస్తున్నారు, కవియొక్క ప్రతిభనుగురించి ఆలోచిస్తున్నారు, కవిని నిర్వ్యాజంగా ఆరాధించటం సంఘానికొక పరమావధి అనుకుంటున్నారు; నేను సంఘంగురించి ఆలోచిస్తున్నాను, ప్రయోజనంకోసం వెతుకుతున్నాను, కవివల్ల సంఘానికి ప్రయోజనం ఉండాలంటున్నాను. కళారాధనలో నేను మీవెంట రాలేను; సంఘారాధనలో మీరు నావెంట రాలేరు. ఎవరిదారిన వాళ్ళం

పోదాం...అయితే నేను ఇలాగా ఆత్మానందంతో తృప్తిపడి ఉండలేకకాదు సుమండీ—నేను ఆనందించినంతమాత్రంచేత లోకానికేం ఒరిగిందని !"—

ఈ విసురువిసిరి కుర్రాడు వెళ్ళిపోయినాడు. అతనెవరో రామ్మూర్తికి తెలీదు, పేరుకూడా మరిచిపోయినాడు. కాని అతన్నిగురించి అడపాదడపా రామ్మూర్తికి జ్ఞాపకం వస్తూండేది. వాగ్వాదంలో తానే గెలవాలనే పంతం కలవాడుకాడు రామ్మూర్తి. అతని సాత్వికతత్వం దాని కొప్పుకోదు. ఆ కుర్రాడి అభిప్రాయాలు సరయినవి కావని అతనికి గట్టినమ్మకం. అయితే రామ్మూర్తికి లోపల ఒకటే అనుమానం—తను చూసేదంతా చూడటమేగాక ఆ కుర్రాడు మరేదో అధికంగా చూస్తున్నాడని !...

పత్రికలో ప్రచురించటానికి వ్యాసాలు వస్తున్నకొద్దీ రామ్మూర్తికి మరో సమస్య పట్టుకుంది. అతనికి కొత్తరచనలు రుచించటంలేదు. కొత్తవాళ్ళవేకాదు, తనకు అభిమానపాత్రులైన పాతవాళ్ళవికూడాను ! తనకు నచ్చే రచన లిక రావనుకున్నాడు. ఆధునిక సాహిత్యంలో ఒక స్వర్ణయుగం అయిపోయినట్టుగా తోచింది రామ్మూర్తికి.

నవీనసాహిత్యంలో స్వర్ణయుగం పోయిందా, లేక తనలో ఏదో మార్పు వచ్చిందా అనే సమస్య రామ్మూర్తిని బాధించింది. ఆర్థికంగా తాను దెబ్బతినటం ఒకటీ, తాను మద్రాసువచ్చి సాహిత్య వాతావరణానికి దూరంకావటం ఒకటీ చూస్తే ఈమార్పు తనదేనేమో ననిపించింది.

ఆర్థికసంక్షోభం ప్రజల మనస్తత్వాన్ని ఎట్లా మార్చిందీ రామ్మూర్తి తెలుసుకోలేదు. తనలో కలిగినమార్పే అత నర్థంచేసుకోలేడు. వెనక్కు తిరిగిచూసి నిట్టూర్చాడు. ఆ నిట్టూర్పుల ఫలితమే కలావాణి తొలిసంచిక.

ట్రిప్లికేనులో ఒక చిన్నభాగం అద్దెకు పుచ్చుకుని రామ్మూర్తి తన భార్యను తీసుకొచ్చాడు. దాదాపు రెండునెలలు అతను భార్యను వొదిలి ఉన్నప్పటికీ ఎందుచేతనో రామ్మూర్తి అట్టే విచారించలేదు. ఆస్తి పోయినప్పటినుంచీ ఇద్దరిమధ్యా చిన్న ఎడం ఏర్పడటయింది. ఆమె వొంటిమీది నగలన్నీ అమ్ముకుని తినవలసివచ్చింది. ఏదో అపచారం చేసినట్టే భావించుకున్నాడు రామ్మూర్తి. కల్యాణి తన నగలు వొంటిమీది చర్మం వొలిచి ఇస్తున్నట్టుగా ఇవ్వటం రామ్మూర్తిని మరింత బాధించింది. కాని దుఃఖపడందు కతను ఆమెను తప్పు పట్టలేదు. తను మళ్ళీ ఏదోరీతిగా ఆర్జనలోపడి అంతో ఇంతో వెనకవెయ్యటం మొదలుపెడితేగాని తానుచేసిన అత్యాచారం పరిహారంకావటం ప్రారంభంకాదనీ, తమ యిద్దరిమధ్యా ఏర్పడిన ఎడం పూడదనీ రామ్మూర్తి అనుకున్నాడు.

ఆస్తంతా పోవటమూ, భార్యను ఐశ్వర్యంలో ఉంచలేకపోవటమూ తన తప్పేనని రామ్మూర్తి ఎందుకు భావించాడో ఊహించటం కష్టం. కల్యాణిమాట వినక రామ్మూర్తి చేసిన దుర్వ్యయం ఏమీలేదు. ఆమె ఆర్థిక విషయాల్లో అతని కెప్పుడూ ఎటువంటి సలహాకూడా ఇవ్వలేదు—ఇచ్చే తాహతు ఆమెకు లేదుకూడానూ.

ఆస్తి పోవటంతో తాత్కాలికంగా కల్యాణిలోవచ్చిన మార్పు పట్నంరాగానే పోయింది. స్థలం మార్పువల్ల ఆమె గతాన్ని సులభంగా మరిచిపోగలిగింది. కాని తన వొంటిమీది నగలుమాత్రం ఆమెకు మరుపురాలేదు. నిజమైన దారిద్ర్యం - తిండీ, బట్టా, లేకపోవటమూ; వీటికోసరం మరొకరికి చాకిరి చెయ్యవలసి రావటమూ— కల్యాణి ఎరగదు. అందుచేత ఆవిడకు దారిద్ర్య ఫలితాలను చూసి భయపడే అవకాశం కలగలేదు. కాని తన ఒంటిమీది నగలు లేకపోవటం చూసి నలుగురూ, 'వీళ్ళకేమీ లేదుకాబోలు' అనుకుంటారని ఆమె కెక్కడలేని దిగులూనూ.

పట్నం వచ్చినతరవాత రామ్మూర్తిలో మరొరకం మార్పుకూడా వచ్చింది. ఆస్తి పోకపూర్వం రామ్మూర్తికి తన ఆర్థికస్థితి గురించి అసంతృప్తి ఎన్నడూ కలగలేదు. వాళ్ళ స్వగ్రామంలో ఇంతకన్న ఆస్తిపరులు లేకకాదు. అతని దగ్గర వాళ్ళలోనూ లక్షాధికార్లున్నారు. ఐతే ఆ తేడాలు జీవితవిధానంలో ద్యోతకం కాలేదు. తినే తిండిలోనూ, కట్టే బట్టలోనూ, నాటకాలకు కొనే టిక్కెట్లలోనూ, చదివే పుస్తకాల్లోనూ రామ్మూర్తి సులభంగా వాళ్ళతో పోటీ చెయ్యటమేగాక నూటికి తొంభైసార్లు వాళ్ళనుమించి వెళ్ళగలిగేవాడు.

పట్నం వచ్చినతరవాత అతనికీ సంతృప్తి పొక్కలేదు. ఇక్కడ అతను ఎవరితో పోటీచేస్తాడు? ఇక్కడ అతని పరిచయస్థులలో రెండుమూడు లక్షలతో వ్యాపారం చేస్తున్నవాళ్ళున్నారు, కార్లున్నవాళ్ళున్నారు, బట్టలదుకాణంలోకిపోయి తన నెలజీతంపెట్టి భార్యలకు అవలీలగా ఒక చీరె కొనిపెట్టేవాళ్ళున్నారు, పెద్ద బంగళాల్లో నివసిస్తున్నవాళ్ళున్నారు. ఈ పట్నంలో తనజీతం తెచ్చుకునేవాళ్ళు దమ్మిడీల దగ్గర్నుంచీ ఆదా చెయ్యటానికి ప్రయత్నిస్తారని అతను గ్రహించాడు. వాళ్ళని తను అనుకరించకపోయినప్పటికీ వాళ్ళజాగ్రత్త కొంతైనా అతని చేతికి ఖర్చుచేసేటప్పుడు అడ్డుతగలక పోలేదు. చేసేదేమీలేక రామ్మూర్తి ఈ స్థితికి ఆమోదించాడు రామ్మూర్తికి స్వగ్రామంలో వర్గవ్యవస్థ కనిపించినంత స్పష్టంగా వర్గ వ్యవస్థ కనిపించేదికాదు. ఇక్కడ అది కనిపించసాగింది. కాని రామ్మూర్తికీ విషయం ఇంతస్పష్టంగా తెలిసిరాలేదు.

* * *

యుద్ధకారణంగా దిగుమతులు కట్టయి పోయినై. డబ్బు అతివృష్టి అయిపోయింది. ప్రతివస్తువుధరా తాచుపాము తోకలాగా నానాటికీ హెచ్చిపోతున్నది.

"యుద్ధం అయేవరకూ ధరలు హెచ్చుతూనే ఉంటై. యుద్ధం ఇప్పుడప్పుడే కాదు. మేం ఎంత ధరపెట్టి అయినాసరే బంగారం కొనేస్తున్నాం," అని బొంబాయిలో ఉన్న మార్వాడీ స్నేహితుడొకడు రామ్మూర్తికి సలహా ఇచ్చాడు. అతని సలహా మీదనే రామ్మూర్తి మందులుకూడా విరివిగా కొని దాచాడు. లోహసామగ్రికూడా విచ్చలవిడిగా కొని అమ్మసాగాడు రామ్మూర్తి.

అతని సంపద ఎంత హెచ్చిపోతున్నా అతను బాంకులో కానీ ఉంచలేదు. అంతా వస్తువులమీదనే ఉండనిచ్చాడు. అతని కాలం యావత్తూ బొంబాయి మద్రాసుల మధ్య తిరగటంతోనే సరిపోతున్నది.

రామ్మూర్తి ఇన్ని రకాల మనుష్యులతో తిరిగినా బొంబాయి వ్యాపారస్తుల సంపర్కంవల్ల అతనికి కలిగిన ఆనందం మరెవరిద్వారాకూడా అతనికి లభించలేదు. చమన్‌లాల్, మణిక్‌లాల్, ఘాసీచంద్, నేమచంద్, బాపట్‌లాల్, ఛోపట్‌లాల్ వగైరా వ్యాపారస్తుల్నీ, వాళ్ళు చేసే కళ్ళుతిరిగే వ్యాపారాన్నీ తలుచుకుంటేనే రామ్మూర్తి కొక విధమైన పారవశ్యం కలిగేది. డబ్బుచేత గుడ్లు పెట్టించేవాళ్ళే నిజంగా సార్థక జన్ములు. అనవసరంగా కళల్ని గురించీ, సాహిత్యం గురించీ కాలం వృథాచేస్తుంటే ఈ మహానుభావులు లోకాన్ని కుమ్మరి సారె మీద పెట్టి గిరగిరా తిప్పేస్తున్నారు. అయిదువందలూ, వెయ్యీ చూసి అదికూడా డబ్బే అనుకున్న రోజులు తలుచుకుని రామ్మూర్తి సిగ్గుపడ్డాడు. బొంబాయిలో గడ్డివ్యాపారం చేసి లక్షలు గడించేవాళ్ళూ, పాతవ్యాపారంచేసి కోట్లు గడించేవాళ్ళూ ఉన్నారు.

బెంగాల్లో కరువొచ్చింది. ప్రజలు వేలసంఖ్యలో చస్తున్నారు. రాయలసీమలో కరువొచ్చింది, ఒరిస్సాలో కరువొచ్చింది, మలబారులో కరువొచ్చింది. దేశద్రోహులు, "దొంగవ్యాపార్లు, దొంగవ్యాపార్లని" అలజడి చేస్తున్నారు.

కంట్రోలులూ అవీ తీవ్రం కాసాగినై. ఈ దిక్కుమాలిన దేశంలో ఈ వెధవ యుద్ధం మూలంగా స్వేచ్ఛగా వ్యాపారం చేసుకునే ఆస్కారం కూడా పోయింది. చాటుమాటుగా రామ్మూర్తి కాగితమూ, మందులూ, గుడ్డా అయినకాడికి వొదిలించుకోసాగాడు.

యుద్ధం అయిపోయేసరికి రామ్మూర్తి పాతికవేలు డబ్బు చేసుకున్నాడు గాని ఆదాయప్పన్ను కానీ యిచ్చిన పాపాన పోలేదు. డబ్బంతా దగ్గరే ఉంచుకున్నాడు.

అదివర కెన్నడూ రాజకీయాలలో ఆసక్తి ప్రకటించని రామ్మూర్తి యుద్ధం




అయిపోయ్యేనాటికి రాజకీయాలనుగురించి శ్రద్ధ కనబరచసాగాడు. గడచిన జాతీయ స్వాతంత్ర్యోద్యమాలన్నీ ఇప్పు డతనికి సువర్ణాక్షరాలతో లిఖించదగిన చరిత్రగా కనబడసాగింది. దేశీయ నాయకులూ, ఆంధ్ర నాయకులూకూడా అతని కళ్ళకి ఉన్నతంగా కనపడసాగారు. ఈ విషయం తనకు పూర్వం ఎందుకు తెలిసిరాలేదో అతనికి అర్థంకాలేదు. దానికి ఒకటే కారణం కనపడింది. ఆ ఉద్యమాలు ఏదో రూపంలో సఫలత పొందుతున్నాయనీ, దేశాన్ని దాస్యంలో ఉంచిన బ్రిటిషువారి కెక్కడో తగులుతున్నాయనీ అతని కిప్పట్లో నమ్మకం లేకపోయింది. కాని 1942 ఆగస్టులో అకస్మాత్తుగా రామ్మూర్తికి కనువిప్పయింది. కాంగ్రెసులో ఎంత ప్రబల శక్తి ఉంటేనేగాని ప్రభుత్వం ఉమ్మడిగా అంత మందినీ అరెస్టుచేసి ఉండదు... యుద్ధకాలంలో రామ్మూర్తి సంపాదించిన కొత్త స్నేహితుల్లో కాంగ్రెసుపై విశ్వాసం, కాంగ్రెసులో పరిపూర్ణమైన నమ్మకం లేనివాడు లేడు.

అయితే రామ్మూర్తిలో కలిగిన యీ రాజకీయ చైతన్యం ఒక్కసారిగా అతనికి రాజకీయ విజ్ఞానాన్ని కలిగించలేదు. కాంగ్రెసును విమర్శించే వారి కతను సమాధానాలు చెప్పలేకపోయ్యేవాడు. అటువంటి విమర్శలకు ఇవ్వవలసిన సమాధానాలున్నప్పుడుకూడా అతని కవి తెలిసేవికావు. మరెవరన్నా ఆ సమాధానా లిస్తు

న్నప్పుడు రామ్మూర్తి, తనకుకూడా ఆపాటి రాజకీయ పరిజ్ఞానం లేకపోయినందుకు, చాలా చింతించేవాడు.

ఎపరుపడితే వాళ్ళు, సైకిళ్ళలోనూ, ట్రాముల్లోనూ, పార్కుల్లోనూ, బీచిలోనూ, ఇళ్ళలోనూకూడా రాజకీయాలు మాట్లాడుకోవటం ఒక విధంగా అతనికి రుచించేది కాదు. ఈ చర్చలవల్ల అతని రాజకీయ పరిజ్ఞానం పెంపొందకపోగా అతని రాజకీయ విశ్వాసాలు బలహీనమవుతూ ఉండేవి...ఒక నాడతను ఒక అతి విచిత్రమైన సంభాషణ వినటం తటస్థించింది. ఇద్దరు ప్రఖ్యాత కాంగ్రెసువాదులు గాంధీనీ, జవహర్లాలునూకూడా తీవ్రంగా విమర్శించటం విన్నాడు.

మరో సందర్భంలో ఒక కమ్యూనిస్టూ ఒక రాయిస్టూ చర్చించుకుంటుండగా విన్నాడు.

"మీ కమ్యూనిస్టులు నశిస్తేగాని రాజకీయాలు బాగుపడవు. ఇంటర్నేషనల్ తీసి పారెయ్యటంలో స్టాలిన్ చాలా మంచిపని చేశాడు. ఇక మీ రాజకీయాలకు స్టాలిన్ బాధ్యుడుకాడు. మీ కిప్పు డెవరు దిక్కు? యుద్ధం ప్రారంభంకాగానే, ఖచ్చితంగా 'ఇది ఫాసిస్టు వ్యతిరేక యుద్ధం. ఇంతటితో సామ్రాజ్యవాదం నడుము విరుగుతుంది. ఇందులో మనం పాల్గొనవచ్చు.' నని రాయి ఘంటాపథంగా చెప్పినప్పుడు మీరెక్కడున్నారు? మీ బ్రిటిషు కామ్రేడ్సును నమ్ముకుని యుద్ధవ్యతిరేక ప్రచారంచేశారు. హిట్లరు రష్యామీద పడ్డ ఆరు నెల్లదాకా మీకేం జరుగుతున్నదీ తెలీదు," అన్నాడు రాయిస్టు.

"మేం ఆలస్యంగా మేలుకున్నామేమో? అండర్ గ్రౌండులో ఉన్నాం. కాని మా కంటే ముందు మేలుకొని మీరేం చేశారు? ప్రభుత్వం డబ్బుతో యుద్ధ ప్రయత్నం సాగించారేగాని, శ్రామికులను కూడగట్టటానికి తగిన ప్రయత్నం ఏం చేశారు? అసలు మీకు కబుర్లు చెప్పటానికి తప్ప, పని చెయ్యటానికి ఓపిక ఎక్కడుంది?" అని కమ్యూనిస్టు చెప్పాడు.

వాళ్ళ చర్చ రామ్మూర్తి సాంతం వినలేదు. అతనికి అసహ్యం వేసింది. వీళ్ళంతా రాజకీయాలు మాట్లాడట మేమిటనిపించింది. ఒకప్పు డతనికి లీలా నాటక సమాజం ట్రూపును చూచి ఇటువంటి భావమే కలిగిందిగాని దాన్ని త్వరలో మార్చుకునే అవకాశంకూడా అతనికి దొరికింది. రాజకీయాల విషయంలో అటువంటి అవకాశం దొరకటానికి సదుపాయంలేదు. అందుచేత అతను రాజకీయ సిద్ధాంతాల జోలికి పోనేలేదు. రాజకీయాలు తనకు సరిపడవని రామ్మూర్తి త్వరలోనే తెలుసుకున్నాడు.

కాని అంత సులభంగా రాజకీయాలతో అతనికి రుణం తీరిపోలేదు. అభ్యుదయ రచయితల సంఘంవారి సమావేశం అతనికి జతపడింది. దాని విషయం ఆరా తీయగా అదంతా కమ్యూనిస్టుల ప్రత్యేక ఉద్యమమని ఎవరో అన్నారు. అయినా సభలకు వెళ్లాడు. ఈ ఉద్యమంలో తనకు పరిచితులైన పూర్వకవులు కొంద రున్నట్టు తెలిసి ఆశ్చర్యపడ్డాడు. వీళ్ళంతా కమ్యూనిస్టుల వలలో ఎట్లా చిక్కారో అతని కర్థంకాలేదు. అభ్యుదయ రచయితలు జరిపిన వైజ్ఞానిక ప్రదర్శనాలు చూశాడు "ముందడుగు" నాటకం చూశాడు. అన్నీ ఆకర్షవంతంగానే ఉన్నై గాని అందులో ఉదాత్తత కనిపించలేదు. ఉదాత్తమైన కళ మనిషిని కదిలించరాదని రామ్మూర్తి కనిపించింది. ఆ విశ్వాసంలో అతనికి విశ్వాసం కుదిరింది. ఈ కళా ప్రదర్శనాలు తన జీవితాన్ని ఎక్కడా స్పృశించినట్టు రామ్మూర్తికి తోచలేదు. శిల్పంలోకూడా అట్టే సంస్కారంలేదు. అయితే ప్రేక్షకులు వీటిని ఆప్యాయంగా స్వీకరించటం అతనికి వింతగా కనపడింది. ప్రదర్శనాల్లో పాల్గొన్న వారంతా కమ్యూనిస్టులేనని తెలిసినతరువాత అతను వాటిని గురించి ఆలోచించటం మానేసి నిశ్చింతగా ఇంటికి వెళ్ళిపోయాడు.

* * *

ఇటీవల రామ్మూర్తికి పట్నంమీద విరక్తి పుట్టింది.

"సంఘానికి ఎన్నోవిధాల సేవ చెయ్యాలని ప్రయత్నం చేశాను. ఇక విసుగెత్తింది," అన్నా డతను భార్యతో. కల్యాణికూడా దానికి సమ్మతించింది. తన భర్త సంఘసేవ చెయ్యటంకోసం తన జీవితమంతా ధారపోశాడని ఆమె నమ్మింది.

"పత్రికలనీ, సినిమాలనీ, నాటకాలనీ, వ్యాపారమనీ, అబ్బ, ఏం తిరిగారు! రెండు రోజులు వరుసగా మీ రింటో వున్నట్టేలేదు. దేముడి దయవల్ల యింత తినేటందుకుంది గనక ఇహ ఫర్వాలేదు. మనం యీ పాడు పట్నం వదిలేసి యింటికి పోయి యింత ఆస్తి సంపాదించుకుని హాయిగా పడివుందాం పదండి!" అన్నది కల్యాణి.

కాని రామ్మూర్తి జీవిత సమస్య అంత సులభంగా తీరేదికాదు. అన్నివైపులా అతనికి సమస్యలే. రేపు పిల్ల పెళ్ళిచెయ్యాలి, కొడుక్కి చదువు చెప్పించాలి. పదిపన్నెం డెకరాలు పెట్టుకొని దానిమీద వచ్చేదాంతో సరిపుచ్చుకుంటూ హాయిగా కాలుమీద కాలేసుకోవటమనేది అసంభవం. వ్యాపారం చేసి విపరీతమైన లాభాలు తీసినవాడికి పొలంమీద పెట్టుబడి చెయ్యటమంటే చెరుకురసం బెండు నమిలినట్టుగా వుంది. పోనీ ఏదన్నా పత్రికం చేద్దామంటే సామాన్యపు పత్రికంసరళి అతనికి

తెలీదు. ఏ పరిశ్రమలో నన్నా షేర్లు కొందామంటే అలవాటులేక భయం. అదీకాక పట్నంలో వున్న ధనికు లందరిమధ్యా తిరుగుతూ, బొంబాయిలో ఉన్న సేట్లతో సహవాసం చేసేవాడు యివన్నీ వదిలించుకుని ఎక్కడో తన స్వగ్రామంలో అనామకులమధ్య ఉండటం ఎట్లా ?

ఎక్కడ చూసినా యూనియనులూ, సమ్మెలూనూ. పొగాకు పనివాళ్ళూ, ప్రెస్సులవాళ్ళూ, బళ్ళవాళ్ళూ, రైల్వేవాళ్ళూ, ట్రాములవాళ్ళూ, ఫాక్టరీవాళ్ళూ, పాకీవాళ్ళూ - ఒకళ్ళేమిటి ? అందరూ సమ్మెలు చెయ్యటమే.

జీవితం ఇంత దుర్భరం ఎందుకయింది ? 1930 వరకూ తను ఆప్యాయంగా అనుభవించిన శాంతి ఏమైపోయింది ? ఆ రోజుల్లో నాలుగయి దెకరాలుకూడా లేని తనతోటివా ళ్ళనుభవించిన సుఖం ఇంత డబ్బున్నా తనకెందుకు దూరమయింది ? ఏదో ఒకటిచేసి తన పొట్ట పోసుకోవటానికి ఇప్పటికీ రామ్మూర్తి కభ్యంతరంలేదు- పని చెయ్యటమే కూలి అనుకున్నరోజులు విడిచేసి అతను చాలా దూరం వచ్చేశాడు. కాని అతని బాధ ఏమిటంటే ఏం చేసినా తనకు అపాయమే కలుగుతుందనే భయం అతన్ని వెంటాడుతున్నది.

ఎంతో కష్టపడి నాలుగురాళ్లు సంపాదించుకున్నాడు. దొంగవ్యాపారం చేసిన వాళ్ళని ఒకవంక "దేశద్రోహులూ" మరో వంక మహా నాయకులూకూడా తిడు తుంటే ఆ తిట్లన్నీ భరించి దిగమింగాడు. తాను చేసిన దొంగవ్యాపారంవల్ల ఎవరి కొంపా కూలలేదనీ, ఇతరులను దోచినవాళ్ళనే తానూ దోచాననీ సమర్థించు కున్నాడు. కాని ఈ డబ్బుతో ఏం చెయ్యాలో తెలీటంలేదు. ఎటుచూసినా కంట్రోళ్లూ, అరెస్టులూనూ. యుద్ధం హడావుడికూడా తగ్గిపోవటంతో రామ్మూర్తికి కొంత పిరికితనం పట్టుకున్నది.

రామ్మూర్తి యీ సందిగ్ధావస్థలో ఎంతోకాలం వుండలేడు త్వరలోనే తనడబ్బుతో ఏదో పెట్టుబడి చేస్తాడు. తన లాభాల కడ్డంగా ఉన్న శక్తులతో పోట్లాడతాడు. తన స్థితిలోనే ఉన్న శక్తులతో చేతులు కలుపుతాడు. అతనికి కావలసిన శాంతి ఇక రాదు.

కొద్దిరోజుల క్రితం అతనిదగ్గర కొక కుర్రాడొచ్చాడు. పాతికేళ్లుంటై.

"మీ కలావాణి పాత సంచికలుంటే ఒకసారి చూడనిస్తారా ?" అన్నడా కుర్రాడు. అప్పు డత నేదో కథ ఒకటి రాశాట్ట, దాన్ని కాపీచేసుకోవటానికి వచ్చాడు.

రామ్మూర్తి అతన్ని కూచోబెట్టి ప్రసంగంలో దింపాడు. ఆ కుర్రాడు మాటల కోసం తడువుకుంటున్నట్టే మాట్లాడుతూ రామ్మూర్తి ఎత్తిన ప్రతి విషయమూ మాట్లాడాడు. కవిత్వమూ, పత్రికా సాహిత్యమూ, కళలూ, రాజకీయాలూ, ఆర్థిక సమస్యలూ, ప్రజా జీవితంలో ఆందోళనా, అశాంతీ మొదలయినవా టన్నిటిని గురించి రామ్మూర్తితో మాట్లాడాడు.



"మీ రెంతైనా చెప్పండి, జీవితం గురించి మనకి కొన్ని మూలసూత్రాలు తెలిస్తేగాని మనకి పై విషయా లంతుబట్టవు. విశ్వమానవాత్మ ఏకత్వసిద్ధికోసమే పాటుబడుతున్నది. కాని నిరోధకశక్తులు చాలాఉన్నై. సోషలిస్టులే వర్గకలహం ప్రారంభిస్తున్నారని కొందరంటారు అంతా వుత్తదీ! వర్గ విభజనా, ఒకవర్గాన్ని మరోవర్గం అణగ దొక్కటమూ ఏనాడో ప్రారంభమయింది. అణగదొక్కబడకుండా చూచుకోవడానికి కిందివర్గం ప్రయత్నాలు సాగించగానే అప్పుడే వర్గవిభజన ప్రారంభమైనట్టు మాట్లాడతారు. "ఐక్యతా నినాదం ఫాసిస్టు నినాదం" అంటూ ఆ మధ్యని పత్రికల్లో రాశారు. సామ్యవాదం సూచించే ఐక్యతనూ, వర్గరాహిత్యాన్నీ అర్థం చేసుకున్నవాడికి ఐక్యత ఎప్పుడు

పోట్లాడి సాధించాలో ఎప్పుడు సౌమ్యంగా సాధించాలో బోధపడుతుంది. సంఘంలో అశాంతికి ఒకేఒక కారణం దోపిడీ. అదే లేనినాడు ఏ ప్రచారమూ అశాంతిని వ్యాప్తి చెయ్యలేదు. దోపిడి తరగతులవారీగా జరుగుతున్నది. జీవితసూత్రాన్ని చేతులోకి పట్టుకుని కదిలించలేక దానికి చిక్కిపోయినవాడు యీ పరిస్థితి నేమీ చెయ్యలేడు. కిందివాణ్ణి దోస్తాడు, పైవాడిచేత దోపిడి చేయించుకుంటాడు. వా డే కళలు సృష్టించినా, ఏ రాజకీయాల్లో పాల్గొన్నా, ఏ ఆర్థిక సమస్యల్నిగురించి మాట్లాడినా ప్రపంచానికి పిసరంతయినా ఉపయోగం లేదు జీవితసూత్రాన్ని చేతబట్టినవాడు దాన్ని మరింత చిక్కుపరుస్తాడో, చిక్కు విడదీస్తాడో అది వాడి ఆదర్శాలనిబట్టి ఉంటుంది. వాడు మంచికి పనిచేస్తే వాడివల్ల లోకానికి ఉపకారం ఉంది, చెడుకు పనిచేస్తే అపకారం ఉంది. వాడి సాంఘిక చైతన్యం గురించీ, వాడి రాజకీయాలను గురించీ, వాడు సృష్టించే కళల్ని గురించీ, ఉదాసీనంగా ఉండటం బుద్ధిమంతుడి లక్షణం కాదు..."

ఆ కుర్రాడు యుద్ధం గురించీ, భారతదేశపు పెట్టుబడిదార్లు చేసిన యుద్ధ సహాయంగురించీ, దాని మూలంగా ఏర్పడిన రూపాయి కాగితాల అతివృష్టి గురించీ దానిని ఆధారం చేసుకుని దొంగ వ్యాపారస్తులు చేసిన సాంఘిక ద్రోహం గురించీ, చెప్పాడు. రష్యాను గురించికూడా చెప్పాడు. రామ్మూర్తికి కొన్ని పుస్తకాల జాబితా ఇచ్చి, "ఈ పుస్తకాలు తెప్పించుకుని చదవండి. వాటిలో వున్నది కేవలమూ వేద వాక్యమని నమ్మి లేనిపోని ఆవేశాలుకూడా తెచ్చుకోనవసరంలేదు. అందులో సత్యమేదో, అసమగ్రంగా ఉన్న సత్యమేదో క్రమంగా మీకే బోధపడుతుంది. ఈనాటి ప్రపంచాన్ని గురించి తెలుసుకోవటం సులభంకాదు. దానికి తగ్గట్టే అసత్య ప్రచారం చాలా జరుగుతున్నది. "పురుషులందు పుణ్య పురుషులు వేరయా" అన్నట్టు చప్పున చూడగానే సత్యమూ అసత్యమూ పైకి ఓలాగే కనిపిస్తాయి. ఓ పిసరు అసత్యమే బాగున్నట్టుకూడా కనిపిస్తుంది. అంచేత జీవితంగురించి కొంతకాలం ఊహించటం మానండి," అని సలహా ఇచ్చాడు.

రామ్మూర్తి ప్రస్తుతం యీ గ్రంథాలను చదవటంలో నిమగ్నుడై ఉన్నాడు. ఇవన్నీ చదివి అతనికి ప్రపంచంగురించి నిజం తెలిసినకొద్దీ అతని అశాంతి హెచ్చుతుందిగాని తగ్గదు. కాని ఆ అశాంతిలోనుంచి ఏదైనా పైకిరావచ్చు. జీవిత సూత్రం అతని చేతికి చిక్కలేగాని అతను దాన్ని కదిలించటానికి ఏ ప్రయత్నం చేసినా చెయ్యవచ్చు సాహిత్య ప్రపంచంలోనూ, నాటక ప్రపంచంలోనూ అతను సంపాదించుకున్న పేరు సంఘాని కెప్పటికయినా నిజంగా ఉపకరించవచ్చు.






ఆ మేడ...తెలుగు సినిమాలో రావణాసురుడి నకిలీ రత్నకిరీటంలా ఠీవిగా దర్పంగా నిలుచున్న ఆ నాలుగంతస్థుల మేడ...అడివయ్యగారనే ఐశ్వర్యవంతుడిది. అడివయ్యకి ఆరుగురు మొగపిల్లలూ, ఓ ఆడకుక్కా—యివీ సంతానం. ఐశ్వర్యవంతులకీ, ఆఫీసర్లకీ అందమైన పేర్లుండవనే సిద్ధాంతం అడివయ్యపట్ల అతి నిజం. (ఈ సిద్ధాంతానికి కాన్‌వర్స్ నిజమని భ్రమపడి—అందమైన పేర్లున్నవాళ్లు బాధపడిపోనవసరంలేదు) అడివయ్య అచ్చంగా అమ్మాయికిమల్లే పెంచుకుంటున్న ఆడకుక్క రెండునెలల క్రితం కన్న నాలుగుపిల్లలలోనూ మిగిలింది వొకే వొక్క కుక్కపిల్ల. డబ్బున్నవాళ్ళ పిల్లలకే కాకుండా కుక్కపిల్లలకుకూడా డిమాండే కనుక అడివయ్యవంటి అదృష్టం పడుతుందేమో అని ఒకరూ, అతనికి మల్లే మగపిల్లలు పుడతారేమో అనే ఆశతో ఒకరూ—యిలా మూడుకుక్కపిల్ల

లని పెంపకానికి తీసుకుపోయారు. లేని వారి మనిషిపిల్లలకంటె కలవారి కుక్కపిల్లలు గొప్ప. ఏతావాతా అడివయ్యకు మిగిలిన మనవరాలు ఒక్కతే. ఆ కుక్కపిల్లకి యిప్పుడిప్పుడే బొచ్చు మొలుస్తూంది. ఆ బొచ్చుని చూసుకుంటూంటే దానిలో గర్వం మొలుస్తూంది. బొచ్చు కుక్కపిల్ల బొచ్చు — బొచ్చుకుక్కపిల్లకి ముద్దు కావడంలో అసహజం ఏముంది? రావణాసురుడికిరీటం మేడపక్కన చిన్న డాబా — అనంతరావనే అందమైన పేరు కలవాడిది. పేరేతప్ప రేఖ బాగులేని అనంతరావ్‌కి ఆరుగు రాడపిల్లలూ, ఓ మొగపిల్లీ—యివీ సంతానం. ఇవే అతని దురదృష్టానికి నిదర్శనాలు. ఇళ్ళయితే ప్రక్క ప్రక్కన ఉండగలిగాయికానీ మనుషు లుండలేరు. అడివయ్యలాటి ఐశ్వర్యవంతుడి పక్కన ఆఫ్టరాల్ అనంతరావ్, ఆరుగురాడపిల్లల ఫాదర్! అనంతరావ్ ఆరవ అమ్మాయి అరుంధతి లేదూ? ... ఆ పిల్ల రోజూ ఉదయం, సాయంత్రం అడివయ్యగారింటికి వస్తూంటుంది—ఆ బొచ్చుకుక్కపిల్లకోసం. ఆ మేడ దాటి కొంచెం ముందుకి...యిరవై గజాలు నడిస్తే ఎడంవేపుకో మలుపుంది. మలుపు తిరిగి మరో పదిగజాలు నడిస్తే కుడిచేతి ప్రక్కకు ఓ చిన్న బిల్డింగుంది. ప్రభుత్వ కార్యాలయం అది. పట్టి చూస్తేతప్ప ఆ బోర్డుమీ దేముందో అర్థంకాదు. స్పష్టంగా కనిపించని ఆ ఆఫీసులో — ఆఫీసరునుంచి అటెండరువరకూ ఎవరికీ ఎంత వెదికినా చేసేందుకు పనీ కనిపించదు, నెలకోసారి జీతం తీసుకునే పనితప్ప. ప్రభుత్వ కార్యాలయాల సహారా ఎడారులలో అరుదుగా మిగిలిపోయిన ఎండమావిది. ఈ ఆఫీసులోనే ఉంటున్నాడో అబ్బాయి. అతనికీ పనిలేదు. అతను పిల్లిబుర్ర గొరగడంలేదు. కారణం యింటూవంటా లేనివది. వృత్తికానీ కులంకానీ అబ్బాయి దాశరహాకి సంబంధించినదికాదు. పనిలేని అబ్బాయి కాగితాలు బరికేయడం నేర్చుకున్నాడు. ఆరునెలలకిందట అమాంతం రెండువందల పేజీలు బరికేసి — పనిలేని గుమాస్తా కాగితాలు బరికి రచయిత కావచ్చునని లోకంలో కొంత భాగానికి చాటేడు.

కాలేజీ వదలగానే ఆఫీసులోకి లాక్కొనబడినవాడూ, అక్కడ అందరిలోకీ చిన్నవాడూ కనుక వాళ్ళంతా అతన్ని అబ్బాయంటారు — అతని ఆబ్‌సెన్సులో. ఆఫీసులో ... ఆఫీసు టైములో ... ఆఫీసు కాగితాలతోనే అతనా రెండువందల పేజీలూ రాశాడు. రాసింది ఆఫీసులో అయినా రాసింది ఆఫీసుగురించి కాదు. నిజానికా ఆఫీసుగురించి రెండువందల పేజీలు రాయగల్గితే అతని కీపాటికి పద్మశ్రీ వచ్చేసేది. తను వదలివచ్చిన (రాదర్...తనను వదిలేసిన) కాలేజీ గురించి ... ఆ జీవితంలోని స్వీట్ మూమెంట్స్—సమ్మెలగురించి; కాలేజీఅవ

రణలో అటూయిటూ తిరిగే అందమైన అమ్మాయిలగురించి; ఆకతాయిగా ప్రవర్తించే కుర్రలెక్చరర్ల ప్రేమాయణాల గురించి; - ఇవన్నీ కలిపిరాసి ఓ నవల చేశాడు. కాలేజీ వదిలేశాక ఉప్ప దాని విధులూ బాధ్యతలూ తెలిసిరాలేదా అబ్బాయికి. (చాలామంది అబ్బాయిలకు కాలేజీ వదిలేశాకనే అదంటే ఏమిటో ఎందుకో అర్థమౌతుంది.) బాధ్యతుందని గుర్తించిన అబ్బాయి - బాధ్యతకల లెక్చరర్‌ని సృష్టించాడు. (నిజంగా సృష్టే!) వాళ్ళ ప్రిన్సిపాల్ డిఫాక్టో కనుక నవలలో ప్రిన్సిపాలూ చవటే. అబ్బాయి కాలోచనలూ ఆదర్శాలూ మొదలౌతున్నాయి కనుక నవలలో హీరోకే అవి ఆపాదించాడు. క్లాస్‌మేట్ శారదంటే అబ్బాయికి చాలా యిష్టంకనుక తను రాసే నవలలో ఆమెని హీరోయిన్ చేశాడు. అతనికి ప్రేమంటే ప్రేమకనుక కథలో ఎటర్నల్ ట్రయాంగిల్ ఏర్పరిచాడు. ఇన్నిచేసినా అది నవలే అయింవనేందుకు కారణం - తృణమో పణమో యిస్తానని చెప్పి ఓ పబ్లిషరు దాన్ని అచ్చువేయడం. అందరు పబ్లిషర్లలాగానే ఆ పబ్లిషరూ యువరచయిత అబ్బాయికి తృణమే యిచ్చాడు. అడివయ్యగారికి ... సారీ ... అడివయ్యగారి కుక్కకి కుక్కపిల్ల పుట్టిననాడే (ఈ శతాబ్దంలో అటువంటివికూడా చెప్పడం మంచిది) అబ్బాయిచేతికి అచ్చు పుస్తకాలు అందాయి. పబ్లిషరు వాటినితృణంగానే పంపాడు కానీ అబ్బాయిమాత్రం వాటిని పణంగానే స్వీకరించాడు. అందుకే అతని కానందం ముంచుకొచ్చింది. గర్వం పొంగింది. నేను రచయితని అనుకున్నాడు తనలో తనే. ఆ క్షణాలలోనే సాహిత్యప్రపంచాన్ని తన రచనలతో సుశోభితం చేస్తాననీ-సోషల్ రిఫార్మ్స్ తెచ్చేస్తాననీ అనేసుకున్నాడు. ప్రపంచాన్ని ఉద్ధరించేందుకు కంకణం బిగించుకున్నాడు గట్టిగా. (అబ్బాయి చేతికి వాచీయే ఉంది. కంకణం లేదు. వాచీ గొలుసు బిగించుకున్నాడంటే వాస్తవాలంకారం అవుతుంది.)

కాలేజీలకు సంబంధించిన విషయం కనుక పాఠకులలో కొందరు ఆ నవలని బాగానే రిసీవ్ చేసుకోసాగారు. పబ్లిషర్‌కి లైబ్రరీలతో సత్సంబంధాలున్నాయి కనుక నవల పాఠకులని బాగానే రిసీవ్ చేసుకుంటూంది. మన దేశంలో గ్రంథాలయాలూ - నిరుద్యోగులూ ఎక్కువే కనుక కొంతమంది కాలక్షేపం కోసం అయినా చదువుతున్నారు. అలా చదివే వాళ్ళలో పనిలేనివాళ్ళూ-రచయిత లౌడా మని అపలేనివాళ్ళూ అధికం కనుక నవలగురించి ఉత్తరాలూ రాస్తున్నారు.

విద్యార్థులు మెచ్చుకుంటున్నారు - లెక్చరర్లని నవలలో తిట్టినందుకు. లెక్చరర్లు తిడుతున్నారు - తమ గురించి కొన్ని నిజాలు రాసినందుకు.

"మీ నవల యదార్థానికి ప్రతిబింబం. మా కాలేజీలో జరిగిన సంఘటన లెన్నో మీ నవలలో చిత్రీకరించారు."

"మీ నవలలో ప్రిన్సిపాలూ _ మా ప్రిన్సిపాలులాగే ఒట్టిచవట. నవల చాలా బాగుంది ఆయన కో కాపీ యిచ్చాం చదివి బాగుపడతాడేమో అని."

"లెక్చరర్ల ప్రేమాయణాలు బాగా రాశారు వాళ్ళ కుళ్ళునీ, పాలిటిక్స్నీ వెలికిలాగి చూపేరు ఇది చదివైనా బుద్ధి తెచ్చుకుంటారేమో అని లైబ్రరీకి కాపీలు డొనేట్ చేశాం,"

"నేటి విద్యాభ్యాసంలో, విద్యాలయాలలో లోపాలను బాగా ఎత్తిచూపారు. నిష్పక్షపాతంగా చెప్పాలంటే మీది మంచి రచన."

"మిమ్మల్ని మెచ్చుకుందుకు మాటలు చాలడం లేదు."

కృతజ్ఞతలు తెలిపేందుకు ఖర్చు బాగానే అయిందబ్బాయికి. కేవలం అభినందనల లేఖలకోసం ఆఫీసునుంచి ఫైలు తీసుకున్నాడు. లెక్చరర్లు తిడుతూ రాసిన ఉత్తరాలని మరిచిపోయి_అభినందనలను మాత్రం మనసులో నిలవుంచుకున్నాడు. ఏకాంతంలో అభినందన లేఖలను చూసుకుని గర్వపడుతూ మరో నవలకి బృహత్ప్రణాళిక వేసుకుంటున్నాడు. మధ్యాహ్నం భోంచేసి _ కిళ్లీ వేసుకుని _ సిగిరెట్ కాలుస్తూ _ లాల్చీ పైజమాల్లో రచయిత తాలూకు భౌతికకాయం రావణాసురుడి మేడ దాటుతూంది. అతని కీ క్షణాలలో మెదడులేదు. నవల ప్లాటుకోసం అన్వేషణకు పోయిందతన్ని వదిలి. సరిగ్గా అతనా మేడదాటుతూంటే కథానాయకి బొచ్చుకుక్కపిల్ల ఆర్తనాదం చేస్తూంది. కాని _ కుక్కపిల్ల అరుపు అతనిలో చలం కలిగించలేకపోయింది. అలాగే యాంత్రికంగా నడచి _ ఆఫీసు చేరుకుని_కుర్చీలో కూలబడబోతుంటే...

"చూడబ్బాయీ..."అని నాలిక్కరిచేసుకుని "చూడు రచయితా" అని తనను తానే కరక్ట్ చేసుకున్నాడు పరమేశ్వరం.

పరమేశ్వరం ఒకప్పుడు మేసేగాడిదే. పనిలేకపోయినా ఏ టిఫినో తెప్పించుకుని ఆరారగా తింటూ కుర్చీలోపడి కునుకు తీస్తూ ఆఫీసుటైము హాయిగా గడిపేవాడు. కాని...అబ్బాయి...అదే...రాసేగాడిద వచ్చి మేసేగాడిదని చెడగొట్టింది. (ఈ రాసేగాడిద క్షమార్హుడు) అబ్బాయి రాసేగాడిదగా మారుతూ _ సుఖం మేసే గాడిదను చెడగొట్టడం మొదలుపెట్టాడు. రచయిత ఒకడు ఆఫీసులో ఉంటే చాలు _ అమాయకులెవరూ సుఖపడలేరక్కడ. రచనా వ్యాధిపీడితుడు తన రోగాన్ని వ్యాప్తి చెయ్యడు స్వార్థం కొద్దీ. కాని...యీ వ్యాధిపీడితుడు చుట్టుపక్కలవారిని దుఃఖపెట్టేస్తాడు. ఆ బాధలు అమాయకులకీ మంచివారికీ

అంటే తీరుతాడు సరిగ్గా యిదే జరిగింది పరమేశ్వరం విషయంలో.

అబ్బాయి నవల వ్రాయడం మొదలు పెట్టేవరకూ పరమేశ్వరానికి పత్రికంటే దినపత్రికగానే తెలుసు. వారపత్రికలుంటాయనీ, వాటిలో కథలుంటాయనీ, వాటిలో అవకతవక ప్రేమలూ గట్రా ఉంటాయనీ తెలియదు. ఈ విచిత్ర పత్రికా ప్రపంచం గురించి అజ్ఞానిగా ఉంటూ హాయిగా సుఖపడుతూండే పరమేశ్వరంచేత పట్టుబట్టి పత్రికలు చదివించడం మొదలుపెట్టాడు అబ్బాయి. నానాగడ్డీ అందించి చదవమని ఊరుకోడం మానేసి - అభిప్రాయాలడిగేవాడబ్బాయి. అప్పుడప్పుడు ప్రతిఫలంగా లభించే కాఫీటిఫెన్లకోసం కక్కుర్తిపడిపోయేవాడు పరమేశ్వరం. పాలకోసం రాళ్ళు మోసినట్లు కాఫీకోసం కథలు చదివేవాడు. అనకూడదుకానీ యీవ్యాధి క్షయకంటే ఘోరం. చదవడం మొదలు పెడితే ఆ మనిషి చివరకెక్కడ తేలుతాడో చెప్పడం కష్టం. ఉత్తరాలు రాసేవాడిగానో, కథల్రాసేవాడిగానో అయిపోతే ఫరవాలేదు కానీ కథలుచదవడం అనే ఊబిలోనే ఉండిపోతే...చెప్పలేం. ఇంకా పరమేశ్వరం పత్రికా పఠనపు ఊబిలోనే ఉండిపోయాడు. అతనెంత పఠనమైపోయాడంటే - ప్రస్తుతం పత్రిక కోసం షాపుకి పరిగెత్తి వచ్చాడు. పరుగెడుతూనే పేజీలు తిప్పేస్తున్నాడు. ఆ కళ్ళు గారడీలాగా పరుగెడుతూనే చదవ గలిగేస్తున్నాయి. ఇప్పుడతని చేతిలో తాజాపత్రిక ఉంది. రెండు పేజీలనడుమ అతని కళ్ళు అంటుకుపోయి ఉన్నాయి.

"ఘోరం! అన్యాయం...అక్రమం" అరిచాడతను నిన్ననే చదివిన ఓ కథలోని పాత్రలా. "దీన్ని సహించడానికి వీల్లేదు."

"ఏం జరిగింది?" అమాయకంగా అడిగాడబ్బాయి-నల్లనివన్నీ అక్షరాలూ, తెల్లనివన్నీ కాగితాలూ అనుకునే రచయిత అబ్బాయి.

"నా నోటితో...ప్చ్...వొద్దు..." పత్రిక అందించాడు పరమేశ్వరం. ఆ పేరు చూసేసరికి అబ్బాయి గుండెలు ఒక్క క్షణంపాటు ఆగిపోయి - అప్పుడు మళ్ళీ కొట్టుకోవడం మొదలుపెట్టాయి. శరీరం చెమట క్రమ్మింది. పెదవు లదరసాగేయి. ఇటువంటి వివిధ స్థాయీ భావాలూ సంచారీభావాలూ చాలా అయి-తెప్పరిల్లాక మళ్ళీ పత్రికలోకి చూశాడు గుండె దిటవుచేసుకుని.

"వొద్దు...నువ్వు చూడలేవు, చదవలేవు, భరించలేవు-" అంటూ పరమేశ్వరం అబ్బాయి చేతిలోనుంచి పత్రిక తీసుకుని- "నే నెలాగో చదువుతాను విను. భరించు," అంటూ మొదలు పెట్టాడు.

ఆత్రుతగా చూస్తున్నాడబ్బాయి. ఆందోళన ఒక కంట్లోనూ, అపరిమిత

మైన భయం రెండోకంటిలోనూ నిండి పోయాయి.

"విజయవాడవంటి పట్నంలో శత దినోత్సవం చేసుకునే తెలుగు సినిమా హీరోకి ప్రతిబింబం యీ నవలలోని హీరో. అన్ని మంచిగుణాలూ అతనికే ఉంటాయ్. అత్యంత అవాస్తవికమైన పాత్ర..." చదవడం ఆపి స్వంత అభిప్రాయం ప్రకటించాడు పరమేశ్వరం — "మంచిగుణాలున్న మగవాళ్ళు అవాస్తవికమా? హీరోలో మంచిగుణాలుండ కూడదా?"

"ముందు చదువ్."

"కథా పథకం లోపభూయిష్టం. రచన బాల్యావస్థకి ప్రతిబింబం..." మళ్ళీ ఆగిపోయాడు పరమేశ్వరం. "మిస్టర్ రచయితా! ఇది నా ప్రిస్టేజ్ క్వశ్చన్. కథా పథకం లోపభూయిష్టమైతే నేను నీ నవలని సజావుగా ఎలా చదువుకో గలను! ఏ సంఘటనా ముందువెనుక లైనట్లు తోచలేదు. మరి...అసలు కథా పథకం అంటే ఏమిటి?"

అబ్బాయికి ఏమీ అర్థం కాలేదు.

"రచన బాల్యావస్థకి ప్రతిబింబం! ఈ ముక్కకి ఏమిటర్థం? ఇది నీ తొలి నవల కనుక బాల్య రచన అనా? ఈ లెక్కన ఏభైనాలుగో నవలనుంచి వృద్ధ నవల అవుతుందా? లేకపోతే...కాలేజీ కుర్రాళ్ళ గురించి రాసినందువల్ల బాల్యావస్థ అయిందా రచన? ఏమిటీ ప్రయోగం?"

అబ్బాయి పెదవులు తడి ఆరి పోయాయ్. చెప్పడాని కేమీతోచడంలేదు. ఏమైనా చెప్పదల్చుకున్నా పెదవులు విడే టట్లు లేక మెల్లగా తల ఊపాడు చదవమన్నట్లు.

"ప్రతి పాత్రా తెలుగు సినిమాలో పాత్రే. నవలలోనూ ఓ సబ్ ప్లాటుంది. విల నున్నాడు, కమేడియ నున్నాడు. వట్టి రొమాంటిక్ ఫిక్షన్. అంతా సినిమా తనమూ, తెలుగు సినిమా తనమూను. చివరకు పాత్రలుకూడా సినిమాలోలాగే మాట్లాడుతాయ్. ఎంత వెతికినా వాస్తవికత మచ్చుకైనా కనిపించదు. నవల చదువు తూంటే తెలుగు సినిమా చూసినట్లే ఉంటుంది. శైలినుంచి టెక్నిక్‌వరకూ, సంభాషణలనుంచి పాత్ర చిత్రణవరకూ ఒట్టి తెలుగు సినిమా. దీన్ని రాసిన రచయితా, అచ్చువేసిన పబ్లిషర్సూ..."

కొంచెం ఆగి అన్నాడు పరమేశ్వరం "చదివిన వాళ్ళనుకూడా మూర్ఖు లనలేదు. నయమే."

అబ్బాయి తల దెబ్బ తగిలించుకో కుండా టేబులుమీదకు ఒరిగిపోయింది. పరమేశ్వరం జాలిపడి, అబ్బాయి కుర్చీ తోనే రెండు కూల్‌డ్రింకులు తెప్పించి ఒకటి అతనిచేత తాగించాడు. పావుగంట పోయాక తెప్పరిల్లాడు అబ్బాయి.

"నా నవలమీది విమర్శ — నిజమేనా? నీకూ అలాగే అనిపిస్తూందా?"

"లేదు." కుండ బద్దలయినట్లు ఖచ్చి



తంగా అన్నాడు పరమేశ్వరం. కేవలం అబ్బాయిని సముదాయించడానికి సాను భూతి చూపలేదతను. అందులో ఆత్మ రక్షణా ప్రయత్నమూ ఉంది. అబ్బాయి నవల నతను హృదయపూర్వకంగానే బాగుందని అంగీకరించాడు. మనస్ఫూర్తిగానే అభినందించాడు ఆత్మవంచనా పరస్తుతీ చేయకుండా. అద్భుతం కాక పోయినా బాగానే ఉందనిపించిం దబ్బాయి నవల. దాన్ని యీ విమర్శకులు అంత చవకబారుగా తీసిపారేస్తూంటే పరమేశ్వ రానికీ పౌరుషం వచ్చింది. "అబ్బాయ్... నవల బాగా రాశాడీ కుర్రవాడని యీర్ష్య పడి విమర్శించినట్లుందికానీ, న్యాయమైన విమర్శలా లేదు. అసలీ విమర్శకుడికి విమర్శ అంటే ఏమిటో తెలిసినట్లు లేదు. విమర్శ అంటే తిట్టడమే కాబోలనే అపోహలో ఉన్నట్లుంది. చూడగా యీ విమర్శక మహాశయులకు నీ నవల చదవడమూ అర్థం చేసుకోవడమూ చేత కాలేదని స్పష్టమౌతూంది. నాకే అర్థమైన నవల - విమర్శకుల కర్థంకాలేదా

అని అనుమానం కలుగుతోంది. నీకు వచ్చిన ఉత్తరాలలో, అభిప్రాయాలలో, ఎవరూ కథా పథకం సరిగా లేదనీ, అసహజంగా ఉందనీ ఎవరూ అనలేదు కదూ? చూడగా సామాన్య పాఠకుడి కంటె అథమస్థితిలో ఉన్నట్లుంది విమర్శకు...డు...కాదు... విమర్శకురాలు! అరె!... ఈ అగ్గిపుల్ల ఆడ అగ్గిపుల్ల! తెలిసిపోయింది. ఈవిడగా రెప్పుడూ కాలేజీ ముఖం చూడలేదు. గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః నాటి ఛాందస భావాల నంటిపెట్టుకున్న అమ్మమ్మ. నేటి కాలేజీల గురించీ, విద్యార్థుల గురించీ, అధ్యాపకుల గురించీ యీవిడకు తెలిసింది శూన్యం. ఈమె గారికి తెలిసిన దొక్కటే – పత్రికలవాళ్ళు విమర్శ వ్రాయమన్నారని అవాకులూ, చవాకులూ అసభ్యంగా వ్రాయడం! మిస్టర్ నేను నిజం చెబుతున్నాను. నీ రచన మహాద్భుతం కాకపోవచ్చు. కాని... అంత తీసిపారెయ్యవలసింది కాదు. అది మాత్రం కటికనిజం. నువ్వు బాధపడకు. ఆఫ్టరాల్ ఓ ఆడ అగ్గిపుల్ల కాదన్నంత మాత్రాన నీకూ నీ నవలకూ వచ్చిన ప్రమాదమూ లోటూ ఏమీలేవు."

"ఆడ అగ్గిపుల్ల కాదు, మొగవాడే. సాధారణంగా విమర్శకులు నిజ నామధేయాలతో విమర్శలు వ్రాయరు. పెన్ నేమ్."

"అయితే యిది ఆడపిల్ల పేరుతో మొగవాడు వ్రాసిన విమర్శ అన్నమాట. బాగుంది. ఇంతకీ విమర్శ అంటే ఏమిటి?"

అబ్బాయి ఏమీ చెప్పలేకపోయాడు.

"విమర్శ అంటే రచయితను తిట్టడం అనేనా ఏమిటి?"

"కాదు." మెల్లగా అన్నాడు అబ్బాయి. "నిజానికి విమర్శ సాహిత్యాన్ని ప్రమోట్ చేసేదిగా ఉండాలికాని కిల్ చేసేదిగా ఉండకూడదు. రచయిత గుర్రమనుకుంటే విమర్శ కళ్ళెం. ధ్యేయం సాహిత్యోద్ధరణ."

"విమర్శ అసభ్యంగానే ఉండాలా? రచయిత పొరపాటే వ్రాశాడనుకో. విమర్శకుడు స్థాయి దిగజార్చుకుని రచయితను తన యిష్టంవచ్చినట్లు గజిబెడాఫీసరు ఎల్.డి.సి ని మల్లె తిట్టిపారెయ్యవచ్చునా?"

"లేదు. సభ్యత, సున్నితమూ ఉండాలి. ఎటొచ్చీ ప్రస్తుత విమర్శకులు ఆకనీస సభ్యతా సూత్రాలను విస్మరించారు."

"అసలీ విమర్శకుడి కింత అధికారం ఎవరిచ్చారు?"

"రచయితలే. సాహితీ ప్రపంచంలో మంచి చెడ్డలను చూడమని విమర్శకుల నేర్పరిచారు రచయితలూ, పత్రికలూ. ఎటొచ్చీ విమర్శకులు – విమర్శకుండే ప్రాథమిక లక్షణాలనుకూడా విస్మరించి..."

"డెమోక్రసీనుంచి డెస్పాటిజమ్‌కు

యువ

మారిపోయారన్నమాట! బలే బాగుంది. రచయిత కావడంకంటె విమర్శకుడై పో తేనే నయం. ఇష్టం లేని వాళ్ళందర్నీ తిడుతూ, నోటి దురదా, కలం దురదా తీర్చుకోవచ్చు. బైదిబై—యీ అగ్గిపుల్లలకు స్వయంప్రకాశం అంటే స్వతంత్రంగా రచించగలిగే ప్రతిభ ఉంటుందా?"

"అరుదుగా ఉంటారు అటువంటి వారు. ఒకరిద్దరు మంచి విమర్శకులూ ఉన్నారు..."

"ఏమో! ఈ విమర్శలో నాకేమీ న్యాయమూ, సహజత్వమూ కనిపించడం లేదు."

ఆఫీసు ఖాళీపోయింది. ఇద్దరూ బయటపడి రావణాసురుడి మేడవరకూ వచ్చేసరికి...

కుర్రవాడి - కుక్కపిల్ల బొచ్చులాగు తూంది. అది అరచి గీ పెడుతూంది బాధతో. అదొక ఆటగా ఉన్నట్లుంది కుర్రదానికి. పిల్లికి చెలగాటం, ఎలక్కి ప్రాణసంకటం అన్నట్లూ; విమర్శకుడికి వేళాకోళమూ రచయితకి రచనా సంకటమూ అనదగేటట్లూ ఉంది అబ్బాయి పరిస్థితి.

ఆ రాత్రి అబ్బాయికి నిద్రపట్టలేదు. జ్వరం వచ్చినట్లు వళ్లు పేలిపోతూంది. తను సిన్సియర్‌గా కష్టపడి నిర్మించుకున్న కీర్తిసౌధాన్ని, విమర్శక రాక్షసుడు వికటాట్టహాసాంతో కూలద్రోస్తున్నట్లు పీడకలలు వస్తూ కలతనిద్ర అయిపోయింది. తన ఊహాలని సమూలంగా నాశనం చేసేశాడు విమర్శక దుర్మార్గుడు. ఆశలనీ ఆశయాలనీ అధఃపాతాళానికణగ ద్రొక్కేడు క్రిటిక్ దుష్టుడు. మహారచయిత కాబోతున్న తనను సర్వనాశనం చేశాడు. ఇక తను ఏం రాసినా ఎవరూ అచ్చేసుకోరు. సాహిత్యవనాన్ని తన నవలా కుసుమంతో అలంకరించబోయి చివాట్లు తిన్నాడు తను. భగవాన్! తన ప్రాణాని కెక్కడ దాపురించాడీ విమర్శక విధ్వంసకుడు. తన పురోగమనానికి అడ్డు పుల్ల వేసిన - ఆటంబాంబు వేసిన యీ దౌర్భాగ్యు ణ్నేంచేస్తే పాపముంది? ఏం చేస్తే తీరుతుంది తన కసి? అబ్బాయిలో ఆవేశం అవధులు మీరింది. పళ్లు పటపట కొరుక్కోసాగాడు. కాలం గడుస్తున్నా ఏకాంతంలో జుత్తు పీకున్నాడు. అప్పుడప్పుడతని కన్నులు చెమర్చుతున్నాయ్. మనిషి కొన్నివేళల కోపంగా; కొన్నివేళల దీనంగా ఉంటున్నాడు. అప్పుడప్పుడు - జీవితంలో పూర్తిగా ఓడిపోయిన వాలకం ప్రదర్శిస్తున్నాడు.

ప్రాద్దామనుకున్న నవలని-శాశ్వతంగా వాయిదా వేసేశాడు. రూములో కాగితమన్నది లేకుండా అన్నీ కుప్పవేసి తగలపెట్టాడు. ఇన్నిచేసినా అతని గుండెలు మండుతూనే ఉన్నాయి. హృదయంలో జ్వాలలు ఏమాత్రమూ ఆరలేదు.

పదిహేనురోజు లిలాగే గడిచాయ్.

అబ్బాయితో మాట్లాడటానికి పరమేశ్వ రానికికూడా సాహసం చాలలేదు.

ఆఫీసుకి వారంరోజులు శలవుపెట్టాడు హఠాత్తుగా. అబ్బాయి మద్రాసు వెళ్తున్నాడని తెలిసి కంగారుపడిపోయాడు పరమేశ్వరం. విమర్శకుడి నివాసం మద్రాసులో అని గుర్తుకురాగానే మరింత కంగారుపడి ఏవోచెప్పాలని రైలుస్టేషన్‌కి పరుగెత్తాడు. కాని ... అప్పటికే రైలు కదిలిపోయింది.

* * *

"నమస్కారం. మీరు..."

"అవును నాయనా ... ఏం పనిమీద వచ్చావ్? కథలూగట్రా రాస్తూంటావా?" వాట్ సిక్‌స్టీనైన్ గ్లాసులోకి వొంపుకుంటూ అడిగాడతను.

"లోగడ ఓ నవల రాసేనండి. అది మీరు విమర్శ..."

"చక్కగాచేస్తాను. నిన్ను అమాంతం ఆకాశానికెత్తేస్తాను. బుడ్డితెచ్చేవా?"

"క్షమించండి. మీ రప్పుడే దాన్ని విమర్శించేశారు."

"అలాగా!...మరిచిపోయాను. ఏమిటి కథ?"

"ఇదుగో నా నవల, ఇది మీ విమర్శ, పోతే,..యివి నాకు వచ్చిన అభినందనల లేఖలు. దయచేసి అన్నీ చూస్తే..."

"నాకంత ఓపికాలేదు, తీరుబడీలేదు." మరోపెగ్ రడీ చేసుకుంటున్నాడతను.

అబ్బాయి తెల్లబోయాడు.

"వెళ్లు వెళ్లు...మా ఆవిడ ఊరి కెళ్ళింది కదా అని స్వేచ్ఛగా నేను సుఖ బడుతూంటే నీ గోలేమిటి మధ్య?" కసురుకుంటున్నాడతను.

"వెళ్ళిపోతానండీ. కాని ... మీకు కృతజ్ఞతలు చెప్పుకునేందుకు అవకాశం యివ్వండి దయచేసి.

నేను నా నవలలో వాస్తవిక సంఘట నలే వ్రాశాను. కాలేజీలలో సామాన్యంగా జరుగుతున్న సంఘటనలనే తీసుకున్నాను ఎదురయ్యే మనుషులనే చిత్రించాను. మీరేమో అంతా వట్టి తెలుగు సినిమాలా ఉందని కొట్టిపారేశారు. రాయడం చేత కాదన్నారు..."

"అంటే అన్నానులే. అంత నవల చదివి విమర్శించడం ఎవరితరం? అయినా వేలెడులేవు, నీకు నవలలూ నాటకాలూ ఏమిటి? పోయి చదువుకుని బాగుపడు." మరోపెగ్ అందిస్తున్నాడు విమర్శకుడు.

"సార్...మీరు...సినిమా పాటలు రాయగలరా?" హఠాత్తుగా అడిగేడు అబ్బాయి.

"అదేమిటి? ఏమిటి నీ ప్రశ్న?"

"మీరు వ్రాసి యిస్తానంటే పాటకి వంద చొప్పున యిస్తాను. ఆరు పాటలు కావాలి..."

"కొంపదీసి నువ్వు సినిమా తీయటో



తున్నావేంటి?" కళ్లు పెద్దవిచేసిచూసేడు విమర్శకుడు. "కమాన్...నువ్వూ ఓపెగ్ తీసుకో...చెప్పు.. సినిమా తీస్తున్నావా బంగారు పిచికా?"

"ఆ విషయం దేనికిలెండి చెప్పండి."

"సినిమాకని పాటలు రాసే ఉంచానోయ్. పాతికపైగా ఉన్నాయి. ఎటొచ్చీ ఎవడూ తీసుకోలేదు. తెస్తానుండు..."

"ఆగండి. నేను సినిమా తియ్యబోవడం లేదు. కాని ... ఓ సినిమాకి కథ మాటలూ నావే..."

"నిజమే?"

"ఇదుగో అగ్రిమెంటూ, చెక్కూ. కథకి పాటలూ నన్నే వ్రాయమన్నారు. అది నాకు చేతకాదు...నన్ను సినీ రైటర్ని చేసింది మీరు..."

"నేను చేశానా? ఏమిటండీ మీజోకు? సినిమాల్లో వేసే జోకు లిప్పుడే నామీద వెయ్యడం లేదుకద?"

"నిజంగా యిదంతా మీచలవే అంటే మీరు నమ్మలేరు. ఈ ప్రొడ్యూసర్ నా నవలనే సినిమా తియ్యబోతున్నాడు! నిజానికతను నా నవల చదవలేదు. ఓ సారి ఏమీతోచక తిరగేస్తూంటే నా నవలమీది మీ విమర్శ కనిపించిందట. అంతా విజయవంతమయిన తెలుగు సినిమా మాడల్లో ఉందంటూ నా నవల గురించి ఏకిపారేశారు మీరు."

"సారీ సార్ ! మీ రింత గొప్పవా రనుకోలేదు ఇప్పుడు జ్ఞాపకం వస్తూంది. ఆవేళ...ఫారిన్ డ్రింక్ మాట దేము డెరుగు, కంట్రీ లిక్కరుకూడా కరువై పోయింది. మా ఆవిడ ఏదో వస్తువు తీసుక రాలేకపోయానని వేధించి వేధించి వదిలిపెట్టింది. ఎవడో తెలుగు సినిమాకి తీసుకెళ్ళి నా జేబులో డబ్బు కాళీ చేయించాడు. అటువంటి మూడ్‌లో నవల చదవడం సాధ్యమా ? అందుకని స్థాలీపులాకన్యాయంగా అక్కడక్కడ పేజీలు తిప్పి విమర్శ వ్రాశాను. నిజం చెప్పేశాను. ఏమీ అనుకోకు. కొత్త రచయిత కదా అని అలా చేశాను ఇంకా నీ నవల లేమన్నా ఉంటే చెప్పు. అద్భుతమైన రచనలని పైకెత్తేస్తాను. జరిగింది మనసులో పెట్టుకోక క్షమిస్తావు కదూ ?

ప్లీజ్, నీ సినిమాకి...అదేలే...... నువ్వు కథా, మాటలూ రాయబోయే సినిమాకి నా పాటలు తీసుకుంటావ్ కదూ ?"

"ఇంత మేలు చేసిన మిమ్మల్ని మరిచి పోతానా ? రేపు నా రూముకి మీ పాతిక పాటలూ పట్టుకురండి. నాకు నచ్చితే తీసుకుంటాను. రేటు మాత్రం పాటకి ఏభయ్యే. మీ కింకా సినిమాలలో ప్రవేశం లేదుగా ? అందుకని !..." హుందాగా అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయా డబ్బాయి. అదే సమయానికి...

రావణాసురుడి కిరీటం మేడలోని బొచ్చు కుక్కపిల్ల గోడదూకింది. ఆ కుర్రది పీడిస్తూంటే తప్పించుకుందుకు చేసే ప్రయత్నాలలో దూకడం అనుభవం మీద అలవడింది దానికి. గోడదాటి యివతలకు వచ్చాక విశాలంగా కని పించింది ప్రపంచం. తన బొచ్చులాగి బాధించే కుర్రదాని బారినుండి తప్పించు కుందుకు ఆ కుక్కపిల్ల దారీతెన్నూ లేకుండా దూరంగా పారిపోతూనే ఉంది





# మీనా

యద్దనపూడి సులోచనారాణి

(గత సంచిక తరువాయి)

"నీ కెందుకంత శ్రమ?"

నేను అతని జబ్బమీద గట్టిగా గిల్లాను.

"అబ్బా!" కెవ్వుమనబోయిన అతను నోట్లోంచి శబ్దం రాకుండా ఎలాగో నిగ్రహించుకున్నాడు.

"ఇంకెప్పుడూ అలా వ్యంగ్యంగా మాట్లాడకుమరి." పాఠం చెబుతున్నట్టుగా అన్నాను.

"నేను వ్యంగ్యంగా మాట్లాడానా?"

"నాకు అలా అనిపించింది మరి."

"నీతో చాలా బాధే సుమా! పాపం సారథి –"

నేను మళ్ళీ గిల్లబోయాను. ఈసారి అతను చురుగ్గా నా చెయి పట్టుకుని ఆపేసాడు. అతని గుప్పెటలో చిక్కిన నా చెయినుండి గిలిగింతలులాంటి స్పర్శ వేగంగా గుండెల్లోకి ప్రవహించింది.

"నన్ను సినిమాకి తీసుకువెళ్ళి, నా చెయి పట్టుకున్నావని, నాతో కబుర్లు చెప్పావని, నీ ప్రవర్తన మంచిదిగాదని సుందరికి వుత్తరం వ్రాస్తాను" అన్నాను బెదిరిస్తున్నట్టుగా.

"సరే. వ్రాయి."

"ఇప్పుడు కాదులే. నీమీద బాగా కోపం వచ్చినప్పుడు వ్రాస్తాను."

"నేనూ వ్రాస్తాను సారథికి ఆకాశరామన్న వుత్తరం."

"ఏమని?"

"మీకాబోయే భార్యామణికి కండలు వూడివచ్చేట్టు గిల్లే అలవాటుంది జాగ్రత్త అని."

నేను కోపంగా చెయి వదిలించేసుకున్నాను.

హఠాత్తుగా లైట్లు వెలిగినాయి. వులిక్కిపడిన యిద్దరం తెరవైపు చూశాం. ఇంటర్ వెల్ వచ్చేసింది.

లైటు వెలుతురులో ఎఱ్ఱగా కందివున్న కృష్ణ ముఖంకేసి నేను, వినోదంగా, తమాషాగా చూసాను. అతను జేబులోనుంచి రుమాలు తీసుకుని ముఖం గట్టిగా తుడిచేసుకున్నాడు.

"ఇక్కడే వస్తాను" అంటూ లేచి బైట వెళ్ళిపోయాడు.

నా కేమిటో అందమైన కలలోనుంచి ఒక్కసారి లేచి కూర్చున్నట్టుగావుంది.

కృష్ణ ఎదురుగావుంటే నా కింత అతివాగుడు వస్తుంది ఎందుకు? అతన్ని మాటలతో రెచ్చగొట్టబుద్దేస్తుంది. కవ్వించి, కవ్వించి ఆటపట్టా లనిపిస్తుంది. అతనేమీ అనుకోడని, నా చనువుని, సరదాని అపార్థంగా అర్థం చేసుకోడని నా కెందుకో గాఢమైన విశ్వాసం వుంది.

ఇంత ఫ్రీగా, నవ్వుతూ, తుళ్ళుతూ నే నింతవరకూ ఎవరితోనూ మాట్లాడిన జ్ఞాపకం లేదు. కృష్ణ విషయంలో ఎందుకిలా అవుతోంది.

ఇది నాలోవుందా? అతనిలోవుందా? లేక యిద్దరిలోనూ వుందా? భగవంతుడికే తెలియాలి.

ఒకటిమాత్రం నిజం. యీ ప్రపంచంలో నేను ఏ విషయాన్నయినా, నిస్సంకోచంగా నోరువిడిచి చెప్పేయగలిగిన వ్యక్తి ఒక్క కృష్ణే అన్పించసాగింది.

నా కెంతో యిష్టం ఏర్పడిన యీ కుటుంబానికి, నా మూలంగా ఏదో ఒక రకంగా వుపకారం జరగాలనే తహతహని నేను ఆపుకోలేకుండా వున్నాను.

కృష్ణ యిప్పుడు నాతో మాట్లాడే తీరునుచూస్తే నేను కోరుకున్న పని సులభంగానే కావచ్చు అనే ఆశ కలగసాగింది.

లైట్లు పోయినాయి.

మళ్ళీ సినిమా మొదలైన తర్వాత వచ్చాడతను.

లైట్లు వెలిగినప్పుడు అతను కావాలనే లేచి వెళ్ళిపోయి వుంటాడని అన్పించింది నాకు. వచ్చి నా పక్కన కూర్చుంటూ "చెప్పాల్సిన ముఖ్యమైన సంగతులు అయిపోయినాయా? యింకా వున్నాయా?" అన్నాడు.

"ఇంకో రెండు వున్నాయి."

"త్వరగా చెప్పుమరి."

"ముందిదిచెప్పు. నే నిలా చనువుగా మాట్లాడానని ఏమీ అనుకోవుకదూ ?"

కృష్ణ నావైపు తిరిగాడు. "నువ్వు చాలా చిత్రమైన మనిషివి. నే నేమను కుంటాను ? అనుకునేందుకు అసలు యిందులో ఏముంది ?"

"రక్షించావు." గుండెలనిండా గాలి పీల్చుకుంటూ అన్నాను.

అతను నా వంక యింకా పరీక్షగా చూసాడు.

"నిజంగా నువ్వేదయినా ప్రమాదంలో యిరుక్కునివుంటే నిన్ను రక్షించాలని నాకు చాలా వుంది." అన్నాడు.

"థాంక్స్. నాకు ప్రమాదంలాంటిది వస్తే ముందుగా నీ దగ్గరకే వస్తాను."

"ఛ-ఛ- వూరికే నవ్వుతూ అన్నాను. నీ కలాంటివేవీ రాకూడదు. నువ్వెప్పుడూ యిలాగే నవ్వుతూ, ఆనందంగా, హాయిగా, కొంటెగా, రెచ్చగొడుతున్నట్టుగా వుండాలని మనస్ఫూర్తిగా కోరుకుంటాను నేను."

"నేను అడగబోయేవాటిల్లో రెండో విషయం చెప్పమంటావా ?"

"ఊఁ !"

"రాజేశ్వరికి ఆ పెళ్ళి ఆపుచేసేయి."

కృష్ణ మెడమీద ఏదో వున్నట్టే గోక్కున్నాడు.

అతను నిటారుగా అవటం నేను గమనించక పోలేదు.

"ఆజ్ఞా అది ?"

క్షణంసేపు ఆలోచించి "కాదు, విన్నపమే" అన్నాను.

"అయితే ఫర్వాలేదు తోసిపుచ్చవచ్చు."

అతనితోపాటు నేనుకూడా నవ్వాను.

"రాజు నీకు యీ పెళ్ళి చేసుకోనని ఎదురుతిరిగితే ఏంచేస్తావు ?" సీరియస్ గా అడిగాను.

"ఏం చేయాలో అప్పుడు ఆలోచిస్తాను. జరగనివాటిని గురించి జరుగుతాయేమోనని వాపోతూ కూర్చోవటం నా కలవాటులేదు."

నేనేం జవాబు చెప్పలేకపోయాను.

"నీ మూడో విషయంకూడా చెప్పేస్తే..."

నా నోట్లోంచి మాట రాలేదు.

"చెప్పు మీనా." అనునయంగా అడిగాడు.

"నేను చెప్పినదానికి నువ్వు తప్పకుండా ఒప్పుకుంటానని ముందు వాగ్దానం యివ్వాలి."

"విషయం తెలుసుకోకుండా వాగ్దానాలు యివ్వటం నాకు అలవాటు లేదే-"

"అయితే అసలు నేను చెప్పనే చెప్పను. నా మీద అంత నమ్మకంలేదా ?"

నామీద అతనికి నమ్మకం వుందో లేదో అతను కించిత్తుకూడా నాకు తెలియనీయలేదు.

"మనం యిక వెళ్దామా?" అంటూ లేచాడు. నేను చెయ్యిపట్టి గట్టిగా లాగి కూర్చోపెట్టాను.

అతను నావైపు సీరియస్‌గా చూసాడు. రెట్టింపు సీరియస్‌గా చూసాను నేను.

ఇద్దరం ఒకేసారి నవ్వాం. అతను చప్పున మా నవ్వు ఎవరికైనా వినిపించేదేమోనని చుట్టూ చూసాడు. సినిమాలో నాయకీ నాయకులు డ్యూయెట్ పాడ్తూ వుండటంతో ఆ పాట శబ్దంలో వినిపించలేదు.

అతను నవ్వుతూ అన్నాడు. "లాభంలేదు. నీతో సీరియస్‌గా వుండటం అనేది కుదరదు. దయయుంచి అదేమిటో చెప్పు. నాకు బాగుంటే, తప్పకుండా నీమాట శిరసావహిస్తాను"

నాకు ఆశ కలిగింది.

"నేను చెప్పేది నీ పొలంగురించి'' అన్నాను.

''పొలంగురించా ?"

"అవును. ఆ పొలం నువ్వు కొనేసుకో. డబ్బు నేను యిస్తాను. నీ వీలు వెంబడి నాకు తీరుద్దువుగాని. ఆ పొలం అంటే నీకెంత యిష్టమో నాకు తెలుసు. దాన్ని సుందరిపేరిట రిజిష్టర్ చేయటం నాకేమాత్రం యిష్టంలేదు.''

అతను తెల్లబోయినట్టుగా, వూహించని సంభాషణ ఎదురైనట్టుగా చకితుడై నావైపు చూడసాగాడు.

అతని చేతిని నా చేతుల్లోకి తీసుకుంటూ మృదువుగా అన్నాను: "నీ స్వాభిమానం నాకు తెలియందికాదు. నువ్వు యీ విషయంలో ఏమాత్రం సంకోచించవద్దు. నువ్వు డబ్బు అప్పుకోసం ప్రయత్నిస్తున్నావని, ఎక్కడా దొరకలేదని నాన్నగారు నాకు చెప్పారు. ఆ అప్పేదో, నా దగ్గరే తీసుకో. నీకు వీలయినప్పుడు మెల్లగా తీర్చేద్దువుగాని" నామాటలు పూర్తిగా విన్న అతను నా చేతుల్లో చెయి వదిలించుకోబోయాడు. కానీ నేను వదల్లేదు. ముఖం తిప్పుకుని సినిమావైపు ఏకదేకంగా చూడసాగాడు.

"నేను చెప్పింది విన్నావా ?"

"విన్నాను."

"పోనీ ఈ రోజు ఆగిపోయి ఆలోచించుకుని, నాకేమాటా రేపు చెప్పు."

"లేదు. ఈ రాత్రికి వెళ్ళిపోవాలి నేను."

"డబ్బు తీసుకోటానికి ఒప్పుకున్నట్టేగా! ఎప్పుడు, ఎక్కడ యివ్వమంటావో చెప్పు."

"మీనా ! నీ సలహాకి, సహృదయతకి నా మనఃపూర్వకమైన కృతజ్ఞతలు. నిజంచెప్పు. ఇలా అడగమని నిన్ను మామయ్య పంపించాడా ?"

"ఉహు. నాన్నగారికి తెలియనే తెలియదు. నా అంతట నేనే వచ్చాను."

అతను నామాట నమ్మినట్లు కన్పించలేదు. "యింక వెడదామా ?" అన్నాడు.

"నామాటకి సమాధానం చెప్పవా ?"

"నిజంగా సమాధానం కావాలా ?"

"కావాలనేకదా యింత సంభాషణ."

"అయితే విను. నాకు ఎక్కడా డబ్బు దొరకని పక్షంలో ఆ పొలం వదులుకోటానికైనా యిష్టపడతానుగానీ, నీ దగ్గరమాత్రం తీసుకోను." అతని స్వరం కరుకుగా, నిశ్చలంగా పలుకుతున్న తీరుని గమనిస్తే, అతన్ని ఆ అభిప్రాయంనుంచి మార్చటం కష్టమే అన్పించింది. విషయాన్ని సూటిగా, నిర్మొహమాటంగా తేల్చి చెప్పేస్తున్నట్టుగా వుంది అతని ధోరణి.

"నేను చెప్పినట్టు వినవా నువ్వు ?" నిష్టూరంగా అడిగాను.

"యింకేదైనా చెప్పు. శిరసావహిస్తాను."

ఇద్దరిమధ్యా అంతవరకూ సరదాగా, సరసంగా వున్న వాతావరణం గంభీరంగా, ముభావంగా అయిపోయింది.

క్షణంసేపు యిద్దరం మౌనంగా, ఎవరికివారే సీరియస్‌గా పిక్చర్ వైపు చూస్తూ కూర్చుండిపోయాం.

నాకెందుకో నేను పూర్తిగా ఓడిపోయినట్టుగా అన్పించసాగింది. కొద్దిసేపయింతర్వాత నేనే అన్నాను. నాగొంతులో అడ్డుపడ్డట్టుగా వచ్చాయి మాటలు.

"నామాటంటే నీకు విలువ వుంటుందనే వెట్టినమ్మకమే నన్నిలా తీసుకు వచ్చింది."

"నీ మాటమీద విలువలేకపోతే నేను ప్రయాణం ఆపుకునేవాడిని కాదు. ఈ సినిమాహాలు దగ్గర యింతసేపు ఎదురుచూస్తూ నిలబడేవాడినీకాదు."

"డబ్బు నువ్వు ఎందుకుతీసుకోవు? అసలు కారణం ఏమిటి? సూటిగాచెప్పు." రోషంగా అడిగాను.

"యిప్పుడుకాదు. యింకెప్పుడైనా చెబుతాను. నువ్వు యీ ప్రసక్తి యిక మర్చిపోవాలి."

"వాడంత మొండివాడిని నా యీ జీవితంలో ఎక్కడా చూడలేదు." నాన్నగారి మాటలు గుర్తుకువచ్చాయి. వెంటనే నాకిలా అనిపించింది.

సారథికి నేను నిశ్చయంకాకపోతే, నామీద అమ్మ అన్ని ఆశలు పెట్టుకోకుండావుంటే, ఈపట్టున నేను యితని చెవిపట్టుకుని లాక్కెళ్ళి ఏ రిజిష్టర్ మ్యారేజో చేసుకునివుండేదాన్ని. పెళ్ళంటూ అయితే యిక అతనియిష్టం ఏముంది? అంతా నాదే. ఆ కుటుంబ శ్రేయస్సుకోసం నాన్నగారు, నేనూ ఎంత ఆలోచిస్తున్నామో యీ రాతిమనిషికి కించిత్తుకూడా అర్థంకాదు. చివరికి యిలా అన్నాను :

"సరే. నేను చెప్పినమాట వినటంలేదుగా. నాయిష్టంవచ్చింది నేను చేస్తాను."

"ఏంచేస్తావు?" కుతూహలంగా అడిగాడు.

"నీకు చెబుతానాముందు?" కోపంగా అన్నాను.

"నాకు తెలుసు."

"ఏమిటి నీకు తెలిసింది?" రెట్టిస్తున్నట్టుగా అడిగాను.

"జన్మలో మళ్ళీ నాముఖం చూడవు. మాగురించి వినవు. అంతేనా?"

"చూస్తూండు. నీకే తెలుస్తుంది."

"నువ్వు కోపం వచ్చినప్పుడు ఎప్పుడైనా అద్దంలో చూసుకున్నావా? చాలా బాగుంటావు."

"థాంక్స్. నీ కాంప్లిమెంట్ నాకేం అవసరంలేదు."

"సత్యభామ –"

"అవునవును. నువ్వు కృష్ణుడివికదూ, పాపం. అలుక తీరుద్దువుగానీ."

"మాటలతో ఎందుకలా కవ్విస్తావు?"

హఠాత్తుగా తెరమీద జండా ఎగురుతూ జనగణమన వినిపించింది. వులిక్కిపడిన యిద్దరం ఆశ్చర్యంగా ముఖాలుచూసుకుని లేచినిలబడ్డాం.

సినిమా ఎప్పుడైందో యిద్దరం గుర్తించలేదు. అందరూ వెళ్ళిపోయేవరకూ వుండి చివరన బైటకివచ్చాం. బైట ఆవరణలో ఖాళీటాక్సీ కనిపించింది.

కృష్ణ కేకవేసి పిలిచి, దగ్గరకురాగానే డోర్ తెరిచి పట్టుకున్నాడు. నేను లోపల కూర్చున్నాను.

మాసంభాషణ ముగింపు సరిగ్గాలేకుండా సరిగా మధ్యలోకి తెగిపోయినట్టుగా ఆగిపోయింది. ఎంతో వుత్సాహంగా, ఆశతో – నమ్మకంగా వచ్చిన నాకు చాలా అసంతృప్తి, నిరాశగావుంది.

అతను నామాట వినలేదు. అతన్ని నేను ఒప్పించలేక పోయాను. నా అహంకారం దెబ్బతిన్నట్టుగా వుంది. నేను ఓడిపోయినట్టుగా అన్పించసాగింది.

కృష్ణ డోర్ వేసి దానిమీద చేతులు ఆనించి లోపలకుచూస్తూ అన్నాడు. "చాలా థాంక్స్ మీనా. నేను ఈవూరు ఎన్నోసార్లు వచ్చాను. కానీ యీసారి వచ్చినప్పుడు కలిగినంతటి అందమైన అనుభూతి యింతక్రితం ఎప్పుడూ కలగలేదు. నాయీ అనుభవాన్ని జన్మలో మర్చిపోలేను. రాజుకి ఏమైనా చెప్పాలా?"

"అవసరంలేదు. నేను వుత్తరం వ్రాయగలను." విసురుగా అన్నాను.

అతను యించెం లోపలకు వంగాడు. అతనికళ్ళు నాకళ్ళలోకి వెతికి చూస్తున్నట్టుగా చూసాయి. మృదు మధురమైన స్వరంతో అన్నాడు. "చూడు నువ్వుచెప్పినమాట నేను వినలేదుగాని, నన్ను మీయింటికి పిలవలేకపోయానని

గాని అలాటి తెలివితక్కువ ఆలోచనల్లేవీ మనసులో పెట్టుకోవద్దు. మనమధ్య అలాటి అరమరికలేవీ వుండకూడదు. నేనీరాత్రికి వెళ్ళిపోతున్నాను. ఈసారి ఎప్పుడైనావస్తే ఫోన్ చెయ్యనా?"

"నీయిష్టం." ఎటోచూస్తూ ముభావంగా అన్నాను.

"కోపంవచ్చిందా నామీద?"

నేను అవుననలేదు. కాదనలేదు.

"మామయ్యని అడిగాననిచెప్పు." అతను సరిగ్గానిలబడి డ్రైవర్ కి నేను వెళ్ళాల్సిన వీధిపేరు చెప్పాడు.

టాక్సీ మలుపుతిరుగుతుండగా, నేను వెనక్కుతిరిగి చూశాను. అక్కడే నిలబడివున్నాడతను. అతని ముఖంలో ఎంతో ప్రియమైనవ్యక్తిని దూరంగా పంపేస్తున్నభావం స్పష్టంగా కన్పిస్తోంది. నాకు క్షణంసేపు ఎలాగో అన్పించింది. అతనిలో నేనెప్పుడూ చూస్తాననుకోనిభావం ఏదో అనుకోకుండా చూసినట్టుగా అయింది. నేను తలతిప్పిచూడగానే అతను చేయెత్తి వూపాడు. నేను చేయెత్తేలోపలే టాక్సీ పక్కకు తిరిగింది. అతను నాకు కన్పించలేదు.

టాక్సీ యింటికివచ్చింది. డబ్బుచెల్లించి లోపలకువచ్చి నేను ముందుహాలులో సోఫాలో పేపరుచూసుకుంటూ కూర్చునివున్న డాక్టర్ గారినిచూసి టక్కున ఆగిపోయాను. నాపాదాల సవ్వడివిని పేపరుతీసి చూసిన ఆయన. "ఎక్కడికి వెళ్ళావమ్మా? నీకోసం నేను రావటం మూడోసారి. రెండుసార్లువచ్చి తిరిగి వెళ్ళాను." ఆయన అంటుండగానే తాయారమ్మ అక్కడికివచ్చింది. "ఎక్కడికి వెళ్ళారమ్మాయిగారూ! డాక్టర్ గారు క్లినిక్ కి రాలేదని చెప్పినప్పటినుంచి హడిలి ఛస్తున్నాం. అసలే రోజూ పేపర్లలో అమ్మాయిల్ని ఎత్తుకుపోతున్నారని వెధవ వార్తలు. అబ్బ! నాకు గుండెపడవచ్చింది" అంది.

నేను సమాధానం చెప్పలేనట్టుగా నీరసంగా, డాక్టరు గారికి ఎదురుగావున్న సోఫాలో కూలబడ్డాను.

* * * *

కృష్ణ వెళ్ళిపోయాడు.

అతనితో నేను కలిసిగడిపిన ఆకొద్దిసేపు, ఆజ్ఞాపకం మాత్రం నన్ను వదలలేదు.

అమ్మా నాన్నగారితో కలిసికూర్చుని భోజనం చేస్తున్నా, సారథితో కలిసి బజారువెళ్ళినా, ఒంటరిగా గదిలోపడుకుని రేడియో వింటున్నా అతనికీ నాకూ మధ్య జరిగిన ఆసంభాషణే మధురస్మృతిలా, మరీ మరీ నెమరు వేసుకోవాలని

పించేటంత తియ్యగా నన్ను వెంటాడసాగింది. అతన్ని గురించిన తలపు హృదయంలో మెదలగానే నా మనసులో ఒకవిధమైన ఆనందం కలుగుతోంది. నా పెదవులమీదకి నాకు తెలియకుండానే చిరునవ్వు రాసాగింది.

ఎంత మొండివాడు! మెత్తటి ఆమాటల్లో ఎంత గడుసుదనం! అతని సమక్షంలో క్షణాలు యిట్టే గడిచిపోతాయి! ఒకసారి యిలాగే ఆలోచిస్తున్నాను. అమ్మ, తాయారమ్మ కిటికీలకి, గుమ్మాలకి పరదాలు తెచ్చి వాటి అంచులు కుడుతున్నారు.

అమ్మ వున్నట్టుండి "ఏమిటే మొద్దూ, ఆ ఆలోచన ఏమిటో నాక్కూడా కాస్త చెప్పకూడదూ?" అంది.

నేను వులిక్కిపడి ఆవిడవైపు తిరిగాను. తప్పుచేస్తూ పట్టుబడినదానిలా చూశాను. అమ్మ నన్ను దగ్గరకు రమ్మనమని పిల్చింది. లేచి వెళ్ళాను.

అమ్మ తనపక్కన కూర్చోమని, నానుదుటిమీద పడిన జుట్టుని సరిచేసింది. ప్రేమగా బుగ్గలు నిమిరింది. ఆవిడస్పర్శలోని ప్రభావం ఏమిటోకానీ చప్పున ఆవిడ గుండెల్లో ముఖం దాచుకుని, మెడచుట్టూ చేతులు పెనవేసి కరుచుకు పోవాలనిపించింది. నాకెంతో ఆనందాన్నిచ్చే యీ అనుభవం అమ్మదగ్గర దాదాపు దొరకనే దొరకదు. అమ్మకి మనిషి ప్రవర్తనపట్ల, వ్యక్తిత్వంపట్ల విశిష్టమైన

అభిప్రాయాలున్నాయి. తన అభిప్రాయాలకి సరితూగని మనుష్యుల్ని ఆవిడ కించిత్తుకూడా లక్ష్యపెట్టదు. పెద్దవాళ్ళు చిన్నవాళ్ళులా ప్రయత్నించినా, చిన్న పిల్లలు పెద్దచేష్టలు ప్రదర్శించినా ఆవిడకు చెడ్డచిరాకు. వయసుకి తగ్గట్టు ఆ పసితనం, నిండుతనం, ప్రతిమనిషీ పుచ్చుకోవాలి అంటుంది.

అమ్మ ఎంత ప్రయత్నించినా, నా పెంపకం విషయంలో ఎంత శ్రద్ధ వహించినా, నామనస్సు అహర్నిశలూ చిన్నపిల్లలావుండాలని, అమాయకంగా ప్రవర్తించాలని కోరుకుంటూనే వుంటుంది.

అందుకే అమ్మదగ్గర ఎప్పుడూ ఎంతో బుద్ధిమంతురాలిలా, నోట్లోంచి మాట రానట్టు, అతివినయంగా వుండే నేను, నాన్నగారి దగ్గర సమయం దొరికినప్పుడల్లా గారాబంపోతూ, చిన్నపిల్లలా ప్రవర్తిస్తూవుంటాను.

అమ్మ, మిసెస్ లింగం కలిసి సారథి వుండటానికి యిల్లు చూశారు. బ్రహ్మ చారి, వంటరివాడయిన అతనికి నిజంగాచూస్తే అంతయిల్లు పూర్తిగా అనవసరమే. కానీ రేపు పెళ్ళయితే మా కాపురానికికూడా సరిపోతుందని అమ్మ వుద్దేశ్యంకాబోలు. పెళ్ళయిన తర్వాత కొద్దిరోజులు మేం విడిగావుండాలని అమ్మ నిశ్చయించింది.

ఇంటికి కావాల్సిన అలంకరణలన్నీ అమ్మ స్వయంగా చేసింది. అమ్మపడుతున్న హడావిడి, ఆ ఆర్భాటంచూస్తే, చాలా చిన్నప్పుడు నేను ఆడుకునే బొమ్మలాట గుర్తుకొచ్చింది. నాకో బొమ్మవుండేది. ఆబొమ్మకి పెళ్ళిచేసేదాన్ని, అత్తవా రింటికి పంపేదాన్ని. మళ్ళీ నాకిష్టంలేకపోతే, నాయింటికి తెచ్చేసుకునేదాన్ని. పాపం! నోరులేని రబ్బరుబొమ్మ. నేనెక్కడ పెడితే అక్కడే పడివుండేది. అమ్మ దృష్టిలో నేనలాటిబొమ్మ నయ్యానేమో అన్పించసాగింది.

సారథి అద్దెకుతీసుకున్నయిల్లు, అత్యంత అధునాతనంగా, యింటికితగిన ఫర్నిచర్‌లో కళకళలాడుతూ అలంకరించబడింది. అంతా! ఆ ఫర్నిచర్ చూసి నేను మురిసిపోవాలి. యిదే సుఖం అని సంతృప్తిపడటం నేర్చుకోవాలి. భాగ్య శాలిని అని గర్వపడాలి. అంతేగానీ సారథివల్ల నేనేం సుఖించగలను? అతనికీ నాకూ అభిప్రాయాలు కలుస్తాయా అన్న ఆలోచనే నామనసులోకి రానివ్వ కూడదు. ఇది మెల్లమెల్లగా నేను గ్రహించగలిగాను.

ఈ ప్రపంచంలో కొంతమంది మగవాళ్ళు వున్నారు. వాళ్ళు ధనంతో నిమిత్తంలేకుండా, అంతస్తుతో ప్రసక్తి రాకుండా, చేసుకున్న భార్యలని తమ మంచి మనసులతో, వుదార హృదయాలతో అన్నివిధాలా సుఖపెట్టగలరు!

# ట్విన్ సిటీ గ్యాస్ కం.

## (కోసాన్ గ్యాస్ కంపెనీవారి ఏజంట్లు)

62-బి, సర్దార్ పటేల్ రోడ్, సికింద్రాబాదు-3 ఫోన్ : 76600




బ్రాంచీలు :

గుజరాత్ సేవామండల్ బిల్డింగ్,
రాష్ట్రపతి రోడ్డు, సికింద్రాబాదు-3
ఫోన్ : 72304

కింగ్స్‌వే (రైల్వే బ్రిడ్జి దగ్గర)
ఫోన్ : 76266

భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్
రామచంద్రాపురం, హైదరాబాదు.

4-1-881/7, తిలక్ రోడ్డు
ఆబిడ్సు, హైదరాబాదు-1
ఫోన్ : 42586

చాదర్‌ఘాట్ : కమల్ టాకీస్ దగ్గర్లో ఫోన్ : 52400

అఫ్జల్‌గంజ్ : శంకర్ షేర్ హోటల్ ఎదురుగా ఫోన్ : 42629

కృష్ణవెళ్ళిన నాలుగురోజులకి రాజేశ్వరి పెళ్ళి శుభలేఖవచ్చింది. దాన్ని చూడగానే నాన్నగారు నవ్వారు.

ఆ నవ్వులో 'చూశావా? ఓడిపోయావు నువ్వు' అనేభావం చురుగ్గావుంది. అయినా ఫర్వాలేదు. నాగెలుపు తనగెలుపుగా, నాఓటమి తనఓటమిగా భావించే నాన్నగారిముందు నేను ఓడిపోయినా ఫర్వాలేదు.

మామియింటికి నాపేరుమీద వేరే శుభలేఖ. రాజుదగ్గరనుండి వుత్తరం వచ్చింది.

రాజు చాలా సిగ్గుపడుతున్నట్టుగా, క్షమార్పణ కోరుకుంటున్నట్టుగా వ్రాసింది.

"వదినా!

ఓడిపోయాను. అన్నయ్యని బాధపెట్టటంకంటే, నీముందు ఓడిపోవటమే నాకు వుత్తమంగా అన్పించింది. నేను పిరికిదాన్ని, ఎందుకూ పనికిరానిదాన్ని

---


**FORM IV**

**(See Rule 8)**

| | | | |
|---|---|---|---|
| 1. | Place of Publication | : | 5-9-88, Public Garden Road, Hyderabad-1 |
| 2. | Periodicity of its publication | : | MONTHLY |
| 3. | Printer's Name | | Sri A. SUDHAKARA RAO for Yuva Press |
| | Nationality | : | INDIAN |
| | Address | | Yuva Press, 5-9-88 Public Garden Road, Hyderabad-1. |
| 4. | Publisher's Name | | Sri A. SUDHAKARA RAO for Ms. Yuva Publications |
| | Nationality | | INDIAN |
| | Address | | 5-9-88 Public Garden Road, Hyd-1, |
| 5. | Editor's Name | | Sri CHAKRAPANI (Alias) Sri A. V. SUBBA RAO |
| | Nationality | | INDIAN |
| | Address | | 2 & 3 Arcot Road, Madras-26 |
| 6. | *OWNERS* : | | M/s. Yuva Publications, 5-10-194, Saifabad. Hyderabad-4. |

*Partners* :

| | | *Addresses* : |
|---|---|---|
| Sri | A. V. Subba Rao (Chakrapani) | 2 & 3 Arcot Road, Madras-26. |
| Smt. | A. Jayalakshmi | 2 & 3 Arcot Road, Madras-26. |
| Sri | A. Chandrasekhara Rao-Minor | 2 & 3 Arcot Road, Madras-26. |
| Sri | A. Rajasekhara Rao-Minor | 2 & 3 Arcot Road, Madras-26. |
| Sri | A. Sudhakara Rao | 5-9-88, Public Garden Road, Hyderabad-1. |

I, A. Sudhakara Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Hyderabad.
Date 1-3-1970.

*A. SUDHAKARA RAO*
Signature of Publisher

పెళ్ళికి నువ్వు రావని తెలుసు. అయినా వస్తావేమోననే గుడ్డిఆశతో ఎదురు చూస్తాను. వదినా! నిన్ను మరోకసారి చూడాలని నాపరిస్థితి వివరంగా నీకు చెప్పాలని ఎంతగానో అన్పిస్తోంది. నువ్వు తల్చుకుంటే రాగలవని నా నమ్మకం.

నీకోసం ఎదురుచూసే,

నీ రాజు.''

ఆవుత్తరంచూస్తే, జాలీ, విసుగూ రెండూ కలిగినాయి నాకు. రాజులో యిటు పూర్తిగా పిరికితనమూ లేదు, అటు తెగింపుతనమూ లేదు. ఈమధ్యస్థంగా వూగులాడే మనస్తత్వంతో ఎప్పుడూ దేనికోదానికి బాధపడటం జరుగుతూ వుంటుంది.

రాజు పెళ్ళివిషయంలో పూర్తిగా అపజయంపొందిన నాపట్టుదల కనీసం కృష్ణపొలం విషయంలోనైనా ఘనవిజయం సాధించాలని శపథం చేయసాగింది.

మాడబ్బు ముట్టుకోననికదూ అతని పట్టుదల! మేం అతనికి పరాయివాళ్ళం అని, అతని కష్టసుఖాలతో మాకేం సంబంధం లేదనికదూ అనుకుంటున్నాడు? అతని ఆలోచన్లు అబద్ధం అని నిరూపించాలి.

మాసహాయం వల్లనే అతనికి ప్రాణంతో సమానం అయిన ఆపొలం దక్కినట్టు జీవితాంతం జ్ఞాపకంవుండాలి. ఆపొలంచూసిన ప్రతిక్షణం, మేం అతన్ని ఆదుకున్నట్టు గుర్తుకువచ్చేలా చేయాలి.

కానీ - నిదానంగా ఆలోచిస్తే, నిశితంగా నన్ను నేను పరీక్షించుకుంటే నేను చూపుతున్న యీపట్టుదలవెనక, నాఆలోచన్ల అట్టడుగున యింకేదో భావం వున్నట్టుగా అన్పించసాగింది. ఒకటి రెండుసార్లు సంకోచపు పరదాలని అవతలికి నెట్టి, ఆ అభిప్రాయం అసలుస్వరూపం చూడాలని ప్రయత్నించాను. నాకు కన్పించిన భావంయిది. దాని అసలు స్వరూపంయిది. కృష్ణకి యీ ప్రపంచంలోకెల్లా అత్యంత ప్రియమైన ఆపొలం అతనికితప్ప యింకెవరికీ చెందకూడదు!

చివరికి అతనిభార్య అయిన సుందరికైనా సరే!

కానీ పాతికవేలు! నేనెలా సహాయపడగలను?

నేను కూర్చున్నా, నిలబడినా, పడుకున్నా, నిద్రపోయేముందు, నిద్రలేవగానే నామనసు దీన్నిగురించే ఆలోచించసాగింది. నాన్నగారుతప్ప శరణ్యం లేదు నాకు. (సశేషం).

---

**Printed and Published by A. Sudhakar Rao for Yuva Publications, Hyd-4. and Printed at Yuva Press, Public Garden Road - Hyderabad-1. Phone 36336**
**Controlling Editor: Sri "CHAKRAPANI"**



రాజకీయ బంధనం

March '70 One Rupee Regd. No. H 131